శ్రీశారదాంబాయై నమః






# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

కీలక — శ్రావణ భాద్రపదములు

సంపుటము 57 సంచిక 3

★

సంపాదకుడు

కవికంఠీరవ, కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర, విద్వత్కవివర
బ్రాహ్మీభూషణ కాకరపర్తి కృష్ణశాస్త్రి

సంవత్సరమునకు చందా రు. 3/—

విడిప్రతి 0–60 పైసలు

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

ప్రతిష్ఠాపకులు :

ఆంధ్రభోజ, మహారాజ,

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

వ్యవస్థాపకులు :

శ్రీ జయంతి రామయ్యగారు

ఉద్ధారకులు :

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు, జమీందారు, ఉయ్యూరు.

ఆంధ్రసాహిత్య పరిషత్తు (రిజిష్టర్డు)
కాకినాడ

అధ్యక్షులు

విమర్శకాగ్రేసర, ఐతిహాసికసమ్రాట్
శ్రీ బండారు తమ్మయ్యగారు

ప్రధానకార్యదర్శి, కోశాధికారి
అభినవభోజ
శ్రీ దంటు భాస్కరరావుగారు

సహాయ కార్యదర్శి
కవిశిరోమణి, ఉభయభాషాప్రవీణ (A)
శ్రీ మద్దూరి సూర్యనారాయణశాస్త్రిగారు

కార్యనిర్వాహక సభ్యులు

1. శ్రీ కోటా శివనాథశాస్త్రిగారు
2. బాలవ్యాస, శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
3. భాషాప్రవీణ, వ్యాకరణ విద్యాప్రవీణ
   శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు
4. కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర
   శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు
5. శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ;
6. శ్రీ జయంతి బుచ్చిరామశర్మగారు
7. శ్రీ దామెర రాజగోపాలరావుగారు, బి. ఏ;
8. శ్రీ వేదుల రామచంద్రకీర్తిగారు, ఎమ్. ఏ; (ఆనర్సు)
9. సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ
   శ్రీ ఓ[illegible] వెంకట సుబ్బరాయశాస్త్రిగారు
10. శ్రీ కావలి శ్రీరామమూర్తిగారు, బి. ఏ., బి. ఎల్;
11. శ్రీ నరసింహదేవర కృష్ణశాస్త్రిగారు
12. శ్రీ చిరువోలు వెంకట రామమూర్తిగారు

# విషయసూచిక

కీలక — శ్రావణ భాద్రపదమాసములు.

సంపుటము ౫౨ — సంచిక 3


1. విద్యారణ్యస్వామి
   శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి — 1

2. నన్నెచోడకవి కాలనిర్ణయము
   శ్రీ ఓరుమళ్ల కామేశ్వరరావు — 3

3. శ్రీ పానుగంటి
   శనగన నరసింహస్వామి — 17

4. అజ్ఞాతకౌంతేయము
   శ్రీ అయ్యగారి నరసింహమూర్తి — 19

5. గాంధితాత!
   శ్రీమతి డి. నీలమణి — 24

6. మహాకవి- గోవర్ధనం వేంకటనరసింహాచార్యులు
   శ్రీ శ్రీ రంగాచార్య — 25

7. ఆంధ్రదీక్ష
   (నాటకం) — 1

8. సాహిత్యచింతామణి
   శ్రీ రామసుధి — 171

# విద్యారణ్యస్వామి

—శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి

శా. సద్యోముక్తినికామకారణము లు
చ్చైర్ఘోరదుర్వారితా
విద్యాటోపసమూలనాశనచణా
భీలాగమాంతార్థసం
పద్యోగప్రదముల్ నిరంకుశము ల
వ్యాజంబు లక్షీణముల్
విద్యారణ్యము నీశ్వరారచితముల్
వేదాంతసద్గ్రంథముల్.

శా. ఔరా! వేదచతుష్టయంబునకు స
త్యార్థంబు బోధింప వి
ద్యారణ్యైకకృతంబ కాక యితర
వ్యాఖ్యానముల్ గావనం
బేరుం గాంచి యశస్సుధాలహరి నెం
తే జాల్కొనం జేసినా
వేరీ నీ సరివారు మున్నిపుడు ముం
దీ ధారణిన్ ధోరణిన్.

ఉ. ఎంతటిమందబుద్ధులకు
నేని సుబోధముగాగ గ్రంథ మా
ద్యంతము వ్రాసి మోక్షము గ
రామలకంబుగ జేసినాడ వా
వంతయునైన సందియము
నందగ నెందును దావు లేక ని
శ్చింతగ నారురక్షువు ల
శేషము తోషము నంద నందఱున్.

ఉ. వేదవచో విలాసముల
వెంబడి నీనుడి సంచరించునో
నీదు వచోవిలాసముల
నే నిగమంబులు వెంబడించునో
ఏది యథార్థమొక్కొ "యిద
మిత్థ" మటంచు వచింపజాల మే
భేదము లేదు నీనుడులె
వేదము వేదమె నీదు నెన్నుడుల్.

సీ. రజ్జువునందు సర్పంబట్లు లీ విశ్వ
మాత్మనే తోచు మాయ నని యనుచు
మాయ నా దా లేనిదే యెన్న డన లేని
దేరీతి రచియించు సృష్టి ననుచు
అందుచే దేహత్రయంబు మిథ్య యటంచు
నాత్మ వౌ నీవె సత్యం బటంచు
గుణరూపరహితునకు న్నీకు మృతిజన్మ
కర్మాదికం బెట్లు గలుగు ననుచు

గీ. కర్తగా దోచినను నీ వకర్త వనుచు
బంధమోక్షంబులే యసంభవము లనుచు
నాదిమధ్యాంతరహితుండ వనుచు తత్త్వ
మెల్ల బోధింప సాకల్యతృప్తిఁ గంటి.



# నన్నెచోడకవి కాలనిర్ణయము

— శ్రీ ఈకుమళ్ల కామేశ్వరరావు.

తెలుగు వాఙ్మయములోని కొన్ని సంప్రదాయములను బరిశీలించి, కుమారసంభవకావ్యకర్త యైన నన్నెచోడమహాకవియొక్క కాలమును నిర్ణయింపవచ్చునని కొందఱు విమర్శకు లభిప్రాయపడుచున్నారు. అట్టి పని యెంతవఱకు సాధ్యము? అంకితము, కవిస్తుతి, కుకవినింద, సప్తసంతానములు, అష్టాదశవర్ణనలు మొదలైనవాటిని గ్రహించి నన్నెచోడకవికాలనిర్ణయమునకు వేదము వెంకటరాయశాస్త్రి, ఎమ్. ఏ. గారు బూనుకొని[1] నన్నెచోడుని కవిత్వ మనుగ్రంథమును వెలువరించి యున్నారు. వారి ప్రయత్నము కొనియాడ దగియున్నది. అట్టి ప్రయత్నములో వా రెంతవఱకు కృతకృత్యులైరో స్థాలీపులాకన్యాయముగాఁ జూచెదము.

## 1. అంకితము

నన్నెచోడకవి తన గ్రంథమును మల్లికార్జునునకు నంకిత మిచ్చినాడు. అంకితము చేయు నాచారము దక్షిణదేశవాఙ్మయములో నన్నయభట్టుమహాకవికి పూర్వమునుండియు నున్నది. నాగవర్మయను కర్ణాటకకవి (క్రీ. శ. 990) ఛందోంబుధి యను లక్షణశాస్త్రమును తన భార్యకే యంకిత మిచ్చినాడు. కాఁబట్టి యీ సంప్రదాయ మిటీవల బుట్టినదిమాత్రము కాదు.

పూర్వకాలము కవులు చతుర్భాషాకవు లనియు, అష్టభాషాకవు లనియు ఘనతను బొందినారు. వారు ఇరుగుపొరుగు భాషలలోని లక్షణములను గ్రహించుటలో వెనుకాడలేదు. అయితే ఎవ రెవరినుండి గ్రహించిరో తెలుపుట సులభసాధ్యము కాదని విమర్శకులు

1. నన్నెచోడుని కవిత్వము- వేదము వెంకటరాయశాస్త్రి ఎమ్. ఏ. గారి కృతము (1959)

గ్రహింపవలెను. ఏలనన ఎందఱు కవుల రచనలో నామరూపములు లేకుండ పోయినవి. ఇంక ముందువెనుకల నిర్ణయమునకు నాధార మేది ?

## 2. ప్రబంధము

ప్రబంధశబ్దము వివిధభాషలలో వివిధకాలములలో ననేకార్థములలో వాడఁబడినది.

తెలుగు, కన్నడము, మొదలైన భాషలలోని కావ్యములలో వచనము, పద్యము గూడ నుండినవి యనవచ్చును. అట్టివానిని గమనించియె దండిమహాకవి తాను రచించిన కావ్యాదర్శములో చంపూరచనల నిర్వచనము చేసినాడని విమర్శకులు వక్కాణించుచున్నారు.

అఱవములో ఎనిమిదవశతాబ్దమున నాలాయిరప్రబంధ మున్నది. అది పాటలపుస్తకము మాత్రమె. కన్నడకవియైనపంపకవి తాను వ్రాసిన భారతమున (క్రీ. శ. 941) "పేళ్ళొదర్చిన నీ ప్రబంధం" (ఆ 1-11) అని తెలుపుకొన్నాడు. వామనుఁడను నాలంకారికుఁడు కావ్యాలంకారసూత్రవృత్తిలో (క్రీ. శ. 800) శూద్రకమహాకవి రచనలను గుఱించి[2] "శూద్రకాదిరచితేషు ప్రబంధేషు" అని వాక్రుచ్చినాడు. తిక్కన మహాకవి భారతములో (క్రీ. శ. 1250 ప్రాంతము) ప్రబంధమండలి అని వాడినాడు. ఎఱ్ఱాప్రగడ మహాకవి ప్రబంధపరమేశ్వరుఁడైనాడు.

అయితే పదునాఱవశతాబ్దమునుండి ప్రబంధ మనుపదమును తెలుగులో ప్రధానముగా విలాసకథలకు నుపయోగించినారు.

నన్నెచోడుఁడు వ్రాసిన కుమారసంభవమును ప్రబంధము, కావ్యము, సంహిత యనియె కాక కడపటికి కుమారభాగవత మని కూడ ననవచ్చును. కొంతవఱకు దాని కావ్యలక్షణములు దానివె.

2. ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక సం. 21-1 పుట 5.

అట్టి సందర్భములో నా కవిశ్రేష్ఠుఁడు వాడిన పరిబంధపదమును బట్టి యతని కాలమును సాధించుట సాధ్యము కానిపనిగా తోచుచున్నది.

3. దేశి, మార్గపదములు.

"తెలంగాణాకవులే కాని తీరాంధ్రకవులు తెనుగుమార్గ, దేశి కవితలను గుఱించి వ్రాయలేదు"[3] అను విమర్శకునిపలుకు పూర్ణసత్య మగునా? నన్నెచోడుఁ డుపయోగించిన దేశిమార్గపదములు రచయితలచేత కవిత్వాదికళలలో నుపయోగింపఁబడినవి. క్రీస్తుశకారంభమం దే నాట్యాచార్యుఁడైన భరతుఁడు దేశి, మార్గ అనువిధానములు సంగీతమున నున్న వనెను. రామాయణమున బాలకాండలో దేశి మార్గపద్ధతులలో గాన ముండినది. హేమచంద్రుఁ డనుకవి (క్రీ. శ. 1080) సంస్కృతభాషలో చేరిన దేశిపదములను వెతకి దేశినామ మాల యనుపేర నిఘంటువునుఁ గూర్చెను. జైనమతములో[4] దేశి గణశాఖ యొకటి యున్నది. సంగీతములో మూడు సరణు లున్నవి[5] ఘనము, నయము, దేశీయము. క్రీ. శ. 1000 కి పూర్వ మున్న కన్నడకవులు దేశి, మార్గపద్ధతులను బేర్కొనిరి. 1145 నాటివాడైన భీమయ పండని శాసనములలో దేశిమార్గశబ్దము లున్నవి. కొఱవిగోప రాజకవి (క్రీ. శ. 1380 ప్రాంతము) "తెనుంగు దేశియును, తద్భవముం గలయంగ జెప్పెదన్" అని వ్రాసినాడు. ఆ విధముగా దేశిమార్గపదముల చరిత్ర పూర్వకాలమునుండియు వచ్చుచున్నది. కాని ఆపరిభాష నన్నయభట్టునకు పిమ్మట విరివిగా లేదు. ఆ పదములకు బదులుగా ఆశు, మధుర, చిత్ర, విస్తరము లను సంప్రదాయ మేర్పడినది.

---

3. న. క. పుట 67.

4. కళింగసంచిక పుట 46.

5. నా చరిత్ర - డాక్టరు ఉ. వే. స్వామినాథ అయ్యర్ - సాహిత్య అకాడమి న్యూఢిల్లీ 1965 పుట 28.

### 4. సప్తసంతానములు.

విమర్శకుడు "శాసనములలో సప్తసంతానముల ప్రశంస క్రీ. శ. 1130 నుండి మాత్రమె కనబడుచున్నది"[6] అని వ్రాసినవాక్యము పరిశీలింపదగి యున్నది.

నన్నెచోడకవి తన కావ్యములో సప్తసంతానము లని యేడింటిని తడవినాడు. అయితే ఆ సంతానము లేడుమాత్రమే కాక పెద్ద సంఖ్యగా నున్నవి. అట్టివాటిలో దానకర్తలు యే యేడింటినో యెంచుకొని నిల్పుచుండి రని చెప్పవచ్చును. ఎక్కువచేసినను తప్పిదము లేదు. వాటి చరిత్రను గొంతవఱకు గమనించెదము.

అట్టివాటిని ఆదిలో యిష్టాపూర్తము లనుచున్నట్లు గనఁబడుచున్నది. ఐతరేయబ్రాహ్మణములో (క్రీ. పూ. 700) ఇష్టాపూర్తములు చెప్పఁబడినవి. వాటివిషయ మిట్లున్నది.[7] వర్ణాశ్రమధర్మములను, వేదధర్మములను గాపాడుటకు ఇష్ట మని పేరు. తటాకప్రతిష్ఠ, సభాభవననిర్మాణము, దిగుడుబావిని త్రవ్వించుట, దేవాలయమును గట్టించుట, తోట వేయించుటకు పూర్తము లనిపేరు. ఈ కార్యములన్నియు మొత్తము ఏడైనవి. ఇవి క్రీస్తుశకమునకు పూర్వమె ఏర్పడినవి కదా! ఈ కార్యముల జాబితా నానాటికిఁ బెరిగినది. అయినను సప్తసంఖ్యమాత్రము విడువలేదు.

వేదధర్మమును గాపాడుటకు నగ్రహారములు వెలసినవి. అగ్రహారపదము బహు ప్రాచీనమైనది. క్రీ. శ. 96 ప్రాంతమున బుట్టిన[8] కిందొప్పతామ్రశాసనములో అగ్రహారపదము వాడఁబడినది. అగ్రహార మనుపదముతో నె నల్లిల్లు అనుమాటకూడ పుట్టిన ట్లున్నది.

6. న. క. పుట 51.

7. పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి రాజసూయరహస్యము (1938) పుట 20.

8. ఆంధ్రేతిహాసపరిశోధక మండలి సం. 2-2,3 పుట 151.

కరికాలచోళుఁడు తెలుగుదేశములోని పీఠభూమి భాగమును గొంత జయించి బ్రాహ్మణులకు నగ్రహారములను స్థాపించినాడు.

నల్లిల్లు అనునది పూర్వకాలపు తెలుగుమాట. నలయొక్క రూపాంతరము నల్ల. నలువ (=బ్రహ్మ), నలువు (= నేర్పు, ఒప్పు), నల్లవో (=ఔర) మొదలైనవి దానితోటూకే[9] ఇల్ అనగా స్థలమని యర్థము. నల్లిల్లు (నల్ల+ఇల్లు) అనగా మంచిస్థలము లేక సుక్షేత్రమని యర్థము. అది వ్యవసాయమునకు గాని లేక ఇండ్లనిర్మాణమునకు గాని యుపయోగపడవచ్చును. బ్రాహ్మణుల యగ్రహారనిర్మాణమునకై వాడగా నల్లిల్లు అనునది అగ్రహారమునకు తెలుగుమాట యైనది. కాని క్రమముగా ఇల్లు అనుమాట గృహ మనునర్థమును పొందగా, నల్లిల్లుయొక్క భావము కూడ మారిన దని తోచుచున్నది. క్రీ.శ. 1060 నాటి చంద్రాదిత్యుని శాసనములో[10] తటాకము, శివాలయము, నందన కరవనము, ఇల్లు అని యున్నవి. ఇల్లు అన్నను నల్లిలు లన్నను ఒక్కటే యనిపించు చున్నది. ఎఱ్ఱాప్రగడమహాకవి నల్లిల్లు, అగ్రహారము పదములను వేర్వేఱుగా వాడినాడు. వాటి నిటుపిమ్మట నుటంకించెదను, అటుపిమ్మట దాన విధానముయొక్క పరిభాషలో గొంత మార్పు కనఁబడుచున్నది. క్రీ. శ. 1224 నాటి ఓపిలిసిద్ధిచోడరాజుయొక్క కొణిదెన శాసనములో "సప్తసంతానంబులు, దేవబ్రాహ్మణదత్తులు, సమస్త ధర్మంబులు" అనుపదసంపుటులు గనఁబడుచున్నవి.

సప్తసంతానాదులను నిర్వహించుటకు తెలుగులో "నిల్పుట" యని చెప్పబడుచున్నది. ఈ మాట చిరకాలమునుండి వచ్చుచున్నది. [11]"గంగరట్టగుళ్లు నుఱ్ఱమ్మవల్ల రట్టగుడి పట్టంబు గట్టి నిల్పి" యని యొక ప్రాచీనశాసనములో నున్నది. కొఱవిగోపరాజకవి (క్రీ.శ. 1380 ప్రాంతము.)

9. ఆ. సా. ప. ప. సం. 22-౩,౪ పుట 130.
10. దక్షిణాభారతశాసనములు సం. 10 పుట 644-46.
11. ద. భా. శా. సం 10 నెం 6.

క. ఘను లగ్రజులకు నీడై

వనములు, గ్రితువులును, గృతులు వడి నిల్పిరి–

అని నిల్పియొక్క యర్థమును మఱికొంత సాగదీసినాఁడు. క్రితువులను గూడ నిల్పిరట !

నిల్పి యనుమాట ఇతరార్థములలో గూడ నున్నది. పావులూరి మల్లనకవి (క్రీ. శ. 1080) గణితములో–

క. మొద లొకట నిల్పి దానిం

గదియక దుదిదాక రెట్టిగా గూడినచో

విదితముగ బల్కు మాకుం

జదరంగపుటిండ్లకైన సంకృత మొగిన్.

అన్నాఁడు.

సప్తసంతానముల పరిభాషలో నింకను గొంతమార్పు వచ్చినది. యాదవవంశజుఁడైన మహాదేవుఁ డనురాజు దేవగిరి ముఖ్యపట్టణముగా దేవగిరిరాజ్యమును బాలించెను. (క్రీ. శ. 1260–1278). అతని మంత్రిపేరు హేమాద్రి. అత డొకగ్రంథమును గూర్చినాడు. అయితే యది స్వతంత్రము గాదు. అంతకు మును పున్నస్మృతుల, ధర్మశాస్త్రములలోని ముఖ్యాంశములను క్రోడీకరించి వ్రాసెను. దానికి కల్ప మని పేరిడెను. అటుపిమ్మట దానధర్మములు చేసినవారు సాధారణముగా హేమాద్రినామమును దలపెట్టుచుండిరి. క్రీ. శ. 1250 దైన గణపతిదేవుని కోలవెన్ను[11] తామ్రశాసనములో హేమాద్రి దానకల్పములోని దానములైన గుడికట్టించుట, పెండ్లి యుపనయనములు గావింపఁబడిన వని పేర్కొనఁబడినవి.

రెడ్డిరాజైన కొమరగిరిరెడ్డి (క్రీ. శ. 1385–1403) అనపర్తి శాసనములో (క్రీ. శ. 1390) హేమాద్రి చెప్పినదానములను బ్రోలయ

11. ఆ. ప. మ. సం 1-2 పుట 71-80.

వేముఁడు, అనవేముఁడు నిర్వహించినట్లు తెలిపినాడు. కాటయవేముని యొక్క శాసనములో[12] గూడ హేమాద్రిప్రశంస యున్నది.

తెలుగుకావ్యములలో వీనిప్రయోగములను గొంతవఱకు గమనింపవచ్చును. ఎఱ్ఱాప్రగడ మహాకవి "ఇష్టాపూర్తం బగు క్రియాకలాపంబు" అని ప్రారంభించి[13] హేమాద్రిపరికీర్తితామితదాన నివహంబులని అగ్రహారము, చెఱువు, గుడి, నిధి, నల్లిల్లు, తోట, సత్రము, చలివెందిరని దెలిపినాడు. అది యెనిమిదియైనవి. అగ్రహారము, నల్లిల్లు వేర్వేఱని పలికినాడు. కొఱవి గోపరాజు (క్రీ. శ. 1380 ప్రాంతము)[14] కావ్యము, నల్లిలు, గుడి, చెఱువు, నిధి, వనము, సుతుఁడు అని యేడింటిని పేర్కొన్నాఁడు.

తొలుత దేవ, బ్రాహ్మణాగ్రహారములె యుండినవి. కాని కళింగ దేశ చక్రవర్తియైన మధుకామార్ణవుఁడు(1147–1156)[15] వైశ్యాగ్రహారమును గూడ నిర్మించెను.

అట్లు సప్తసంతానముల సంప్రదాయముండి యుండుటచేత, నన్నెచోడుని ప్రసంగమునుబట్టి యతని కాలమును నిర్ణయించుటకు కుదురుట లేదు.

## ౬. అష్టాదశ వర్ణనలు

నన్నెచోడుఁడు తనకావ్యమును చాలవఱకు దండిమహాకవి చెప్పిన కావ్యలక్షణములను సరిపెట్టుచు వ్రాయదలచినాడు. కాఁబట్టి యష్టాదశవర్ణనలు దానిలోని యొకలక్షణము మాత్రమె. విమర్శకుఁడు "[16]విద్యానాథుని కాలముననె అష్టాదశసంప్రదాయమును తెలుగు

12. ఆ. సా. ప. ప. సం 10-1 పుట 50.
13. హరివంశము ఆ 1 ప 18,19.
14. సింహాసనద్వాత్రింశిక ఆ 1 ప 24.
15. ఆ. ప. మ. సం 8-2,3 పుట 169.
16. న. క. పుట 58

లోనికి తెచ్చుకొంటిమి." "[17]పాల్కురికి సోమనాథుఁడు బసవపురాణములో జెప్పక పండితారాధ్యచరిత్రలోనే చెప్పినాడు" అను అభిప్రాయములు పరీక్షింపఁదగియున్నవి.

అష్టాదశవర్ణనపద్ధతి తెలుగుకావ్యములలోనె కాక కన్నడగచనలలో గూడ నున్నది. ఒక్కొక్కవర్ణనకు నొక్కొక్కప్రకరణముగా క్రీ. శ. 1245 ప్రాంతమున కన్నడకవి యైనమల్లికార్జునకవి సూక్తిసుధార్ణవమను సంకలనగ్రంథమును తయారుచేసినాడు. అంతకుపూర్వముండినకవులు ఎంతకాలమునుండియో ఆసంప్రదాయము ననుసరించుచుండుటచేత నె, ఆ కన్నడకవికి అట్టిగ్రంథము గావించునవకాశము గలిగినది. ఇరుగుపొరుగు భాషలలో నా పద్ధతి యొకలక్షణ మని మాత్రమె గ్రహింపవచ్చును. గుణగాంకియం లను లక్షణగ్రంథము గుణగవిజయాదిత్యునికి (850) సంబంధించిన దని చెప్పబడుచున్నది. అది లభించనందున దానిలోని లక్షణముల నెఱుగలేకున్నాము.

పూర్వపు తెలుగుకావ్యములు కనఁబడకుండుటచేత వానిలక్షణములను చెప్పలేకున్నాము. జైన, బౌద్ధకవులు తెలుగులో నెన్నియో గ్రంథములు వ్రాసిరి. కాని వాటినామరూపము లిప్పుడు తెలియుట లేదు. అప్పటి సంకలనగ్రంథము లైనను బైటబడ లేదు. కాఁబట్టి పూర్వవాఙ్మయలక్షణము లెఱుకవడుట లేదు. తీవ్ర పరిశోధన యవసరము.

## 6. చిత్ర, బంధకవిత్వము.

ప్రతితెలుగుకవియు నన్నయభట్టుతో సహా కాస్తో, కూస్తో చిత్రకవిత్వము చెప్పినవాడె. ప్రతికావ్యములోను ఆశ్వాసాంతపద్యములలో నవి యుండకమానవు. అయితే అది నిజముగా కవిత్వము గాకపోవుటచేత దానికి సంతప్రాధాన్యము నీయలేదు. కాని భాషమోజులో పడిపోయినకొందఱు దానిని మొదల ధరించి రని చెప్పవలసివచ్చుచున్నది.

17. సో. క. పుట 120

దండికావ్యాదర్శసూత్రముల ననుసరించి కావ్యమును నిర్మింపఁ దలచిన నన్నెచోడుని రచనలో చిత్రబంధకవిత్వము లుండుటలో విచిత్ర మేమియును లేదు. ఆ చిత్రబంధకవిత్వములను అమోఘవర్షుఁడను కర్ణాటకకవిరాజు (క్రీ. శ. 850 ప్రాంతము) తన లక్షణకావ్యమైన కవిరాజమార్గలో వివరించినాడు. దానిలోని పద్ధతిప్రకారమె నన్నె చోడుఁడు చక్రబంధములోని మూడవ, యారవ వలయములలో కవి, కవిపోషకుల పేర్లకు బదులుగా నేవేవో మాటలను మాత్రము చేర్చినాడు.

నన్నెచోడుఁడు మెచ్చుకొన్న భారవి (క్రీ. శ. 650) చిత్రకవిత్వ మును జూపినాడు. అట్లె మాఘుఁడును (700). చంద్రరాజు అను కన్నడకవి (1015–1042) మదనతిలక మనుకావ్యమును వ్రాసినాడు. దానిలో చిత్రబంధకవిత్వము లున్నవి. క్రీ. శ. 1245 నాటిదైన వర్ధ మానుశాసనము[18]లోనికి గూడ చక్రబంధశ్లోక మెక్కినది. అట్లు చిత్ర బంధకవిత్వములు దండికాలమునుండియు వచ్చుచున్నవి. అయితే అవి పదునాఱవశతాబ్దినుండి తెలుగువాఙ్మయములో పంటచేనులో కలుపు మొక్కలవలె విజృంభించినవి.

## 7. ఛందస్సు.

మనకు నిర్వివాదముగా నున్న పూర్వపు తెలుగుకావ్యములు లభింపకపోవుటవలన, రాజశాసనములలోని పద్యములె యిప్పటికిని దిక్కగుచున్నవి.

(1) శ్లోకము—కొందఱు పూర్వపు తెలుగుకవులు శ్లోకముతో గ్రంథమును ప్రారంభించిరి. మఱికొంద ఱట్లు చేయలేదు. శాసనవిష యములలోఁ గూడ నట్లే యున్నది. కొన్ని శాసనములలోఁ గడపట దానశ్లోకము లుండును. కొన్నింటిలో నుండవు. అది వారి యిష్టము నకు విడువఁబడినది. కవులవిషయములో వావిలికొలను సుబ్బారావుగా

18. తెలంగాణశాసనములు సం 2-113

రిట్లు ప్రశ్నించుచున్నారు—[19] "తిక్కన భారతములోను, కేతనదశకుమారచరిత్రలోను, మారన మార్కండేయపురాణములోను, రంగనాథునిరామాయణములోను శ్లోకములు గనఁబడ వేమి ?" కాఁబట్టి కేవలము శ్లోకరచన నొకసంప్రదాయముగాఁ దీసుకొనుటకు వీలు లేదుకదా !

(2) స్రగ్ధర—నన్నెచోడుఁడు స్రగ్ధరావృత్తముతో గ్రంథప్రారంభమును జేసినాఁడు, అట్టిసంప్రదాయము పూర్వ ముండెడిదేమో ! కాని కన్నడములో 12 వ శతాబ్దిలో హరిహరకవి రక్షాశతకమును అదేలక్షణములో వ్రాసినాఁడు. ఆ భాషలోనె పుష్పదంతపురాణము స్రగ్ధరావృత్తముతోనె మొదలిడినది. అట్టివాటికి మూలము సంస్కృత పద్ధతి యనవచ్చును.

(3) మంగళమహాశ్రీ—ఈ వృత్తముతో గ్రంథమును ముగించుట యొక సంప్రదాయము. దానినిగుఱించి విమర్శకుడు- [20]"నన్నెచోడుఁడు తిక్కనకు తర్వాతివాఁ డనుటకు మంగళమహాశ్రీ యొక చక్కని నిదర్శనము" అని లిఖించినారు. కాని ఆయన యూహించినట్లుగా నా సంప్రదాయము తిక్కనమహాకవికి తర్వాతిది కానేకాదు. అది చిరకాలమునుండి యమలులో నున్న దని యీ క్రిందియుదాహరణలనుండి తెలిసికొనవచ్చును. క్రీ. శ. 800 ప్రాంతపువాఁడైన బాలవర్మమహారాజు (రాష్ట్రకూటులపరిపాలనలో) కర్నూలుజిల్లాలోని అలంపురములో వేయించిన శాసనములో మంగళమహాశ్రీ యున్నది.[21] కల్యాణచాళుక్యుల (1001) శాసనములో కడపట నట్లె యున్నది. అట్లె మఱికొన్నియు. నన్నెచోడకవికావ్యములో ముద్రాలంకారమును విశేషముగా నుపయోగించినాఁ డనువిషయము మన మెఱిగినదే కదా ! అదికూడ దానికి సంబంధించినదె.

19. ఆ. శా. ప. ప. సం 6-415
20. న. క. పుట 221
21. తె. శా. సం 2 పుటలు 12,19,82

(4) రగడ మొదలైనవి[22]– "నన్నెచోడుడు పుష్పాపచయమును కందములలో వర్ణించినాడు. కాని రగడలో కాదు. అతనికాలములో రగడ లేదు. కావలయును" అన్నారు విమర్శకులు. నన్నెచోడకవికాలములో రగడఛందస్సు జానపదగేయములకు ఉదాహరణకావ్యములకు తగినదిగా తలపఁబడుటచేత కాఁబోలు దానికి నన్నెచోడకవి తన కావ్యములో బ్రవేశించునర్హత నొసగలేదు. కాని కన్నడగ్రంథమైన కవిరాజమార్గలో రగడ చెప్పఁబడినది. అయితే తెలుగులక్షణగ్రంథమైన కవిజనాశ్రయములోఁ గనబడదు. ఏమైనను ఆ ఛందస్సు మాత్రము దేశివాఙ్మయమునుండి సంస్కృతములోనికి పూర్వకాలమందె యెక్కినది. క్రీస్తుశకారంభమందె రగడరకములైన కళిక, అర్థకళికలు భరతముని నాట్యశాస్త్రములో గనఁబడుచున్నవి. సోమదేవసూరి (1940) వ్రాసిన యశస్తిలకచంపువులోను, కోరుమిల్లి శాసనములోను (1022) రగడ లున్నవి.

అయితే తెలుగుకవులు గ్రహించుటలో జాప్యమైనది. పద్యములన్నియు నాలుగు చరణములవి కాగా, రగడచరణములకు మంజరివలెనె పరిమితి లేదు. అదొక ముఖ్యకారణము కావచ్చును. 1290 ప్రాంతపువాడైన చక్రపాణి రంగనాథుఁడు రగడలను వ్రాసినాడు. శృంగార శాకుంతలకర్త (క్రీ. శ. 1440 ప్రాంతము) సైన్యయాత్రను రగడలో వర్ణించినాడు. పిమ్మట నది సామాన్యమైనది.

నన్నయభట్టునకు పూర్వమె చంపకమాల, ఉత్పలమాల, కందము. సీసము, మధ్యాక్కర గలశాసనము లున్నవి. ఆనాఁడెంతయో తెలుగు వాఙ్మయ ముండకున్నచో, నా పద్యములు శాసనములలోనికి నెక్కియుండవు. అంతకుపూర్వ మెంతో గేయవాఙ్మయము ప్రచారములో నుండుట సహజము. తమిళులు క్రీ. శ. నాల్గవశతాబ్దములోని వేదముల పద్ధతి ననుసరించి దేశీయపాటలను ఎట్టుతొగై, పత్తుపాట్టు అను

22. న. క. పు 139

పేర్లతో రెండు వేలకు మించినపాటలను జాగ్రత్తపెట్టుకొన్నారు. మన వారు అట్టిపనిని చేయలేదు. కాని ఈనాడు మనము పాడెడిపాటలలో గూడ ఆ నాటివి కొన్ని యుండవచ్చును. గట్టిపరిశోధన మవసరము.

8 ప్రకీర్ణములు

కవులు తాము చేయుచుండిన కవిస్తుతులలో మతప్రమేయము లేకపోలేదు. దానిని గుఱించి[23] పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వివరముగా వ్రాసిరి, కాని యిక్కడ నుట్టంకించుట లేదు.

నన్నెచోడుఁ డుపయోగించిన 'కైఁవు' అనుమాట (ఆ 11-42, 114,117 మొదలైనవి) కాలనిర్ణయమునకు నుపయోగపడు నని విమర్శకుడు[24] తలఁచినట్లు కనఁబడుచున్నది. కాని ఆ పదము ఇటీవలిది కాదేమో! ఋగ్వేదములో కుత్సుఁ డనురాజు శుష్ణుఁడు, కయవుఁడు అను అనార్యులను జంపెను. కయవు, కైవుశబ్దము లొక్కటియై, పూర్వకాలపువేమో!

కవిస్తుతి సంస్కృతప్రాకృతకావ్యములలో లేకపోలేదు. గాడ వాహ అనుకవి ముప్పదియేడు గురుకవులను స్తుతించినాడు. పూర్వ కన్నడకవులలోఁగూడ కవిస్తుతి, కుకవినింద లున్నవి. కాఁబట్టి యట్టి వానిని తెలుగుకవులు తిక్కనవిరాటపర్వమును చూచి నేర్చుకొన్నా రని భ్రమపడ నక్కరలేదు.

[25]జైనబౌద్ధముల పిమ్మట శైవము బుట్టిన దని విమర్శకుని తలంపు. కాని యది యథార్థము కాదు. ఇప్పటికి నైదువేలయేండ్ల క్రిందటి నాగరికతయైన మహేంజుదారో, హరప్పలలో శైవమె కాని మఱియొకటి లే దనువిషయ మెల్లరకును విదితమే కదా!

నన్నెచోడకవి వాడిన దారిద్ర్యవిద్రావణా (ఆ 10-వ 90-99) అను సంబోధనసమాసము కాలనిర్ణయమున కనుకూల మగునా? కాక తీయ చేతరాజు శాసనమున[26] నా పదము గనఁబడుచున్నది. కాని

23. రామోపాఖ్యానము- తద్విమర్శనము (పె. సు. శాస్త్రిగారు వ్రాసినది.) 1938 పుట 48 లో అధోజ్ఞాపిక.

24. న. క. పుట

25. న. క. పుట 67

26. న. క. అనుబంధము పుట 5

డాని చరిత్ర యిట్లని చెప్పవచ్చును. గుణగవిజయాదిత్యునకు (క్రీ. శ. 850 ప్రాంతము) గుణకనల్లాట యనుబిరుదు గలదు. నల్లాట యను పదముయొక్క సంస్కృతానువాదము దారిద్ర్యవిద్రావణ యన వచ్చును. గుణగుఁడు[27] తులాపురుషమను తూగి బంగారమును బ్రాహ్మణులకుఁ బంచిపెట్టెడివాఁడు. కాగా దారిద్ర్యవిద్రావణబిరుద మాతనిదె యని చెప్పవచ్చును.

9. ముగింపు

[28]ప్రాచీనాంధ్రవాఙ్మయమును అనువాదముగ మనుచున్న వారిమాట యెంతసత్యమో తెలుసుకొనవచ్చును. తెలుగులోని జైన బౌద్ధవాఙ్మయములు నశించినవి. అనేకమంది హిందూకవులగ్రంథములు కనఁబడుట లేదు. కొందఱిపేళ్లయినను తెలియుటలేదు. అట్టిస్థితిలో ఆ యుగధర్మము అనువాదమనుట సత్యదూరము. మనకు మిగిలిన పుస్తకములు అనువాదములని సరిపెట్టుకొనుట మేలుకాని, ఉపజ్ఞతా శూన్యముగ నుండిన దనుట సరికాదు.

నన్నిచోడమహాకవి నన్నయభట్టుగారికి పిమ్మటివాఁడే యైన యెడల, నాతఁడు గండగోపాలుఁ డనుబిరుదు గల చోడబిజ్జన లేక తెలుగుబిజ్జనను (క్రీ. శ. 1020) స్తుతింపక మానఁడు. అట్లే పొత్తపి, కొట్యదొన రాజధానులను బేర్కొనక విడువడు. అంతకుపూర్వపువాఁడగుటచేతనే వాటిప్రశంస కనఁబడదు. రేనాటిచోడులు క్రీ. శ. 1020 ప్రాంతమున కాఁబోలు తమరాజధానిని పొత్తపికి మార్చిరి. అంత వఱకు వారి రాజధాని కడపజిల్లాలోని ఒరయూరనియే చెప్పవచ్చును. రేనాటిని పాలించిన రాజులలో పృథ్వీవల్లభవిజయాదిత్యచోళుని (750) తర్వాతిరాజులపేర్లు తెలియవచ్చుట లేదు. అవి బైటపడినప్పుడు నన్నిచోడుడు క్రీ. శ. 850 ప్రాంతపువాఁడని ధ్రువపడునని గ్రహింపవచ్చును.

పూర్వకాలమునుండియు తెలుగుకవులు కన్నడభాషలోఁగూడ గ్రంథజాలమును వ్రాయుచుండిరి. అట్లు వ్రాసినవారిలోఁ గొందఱు[29]

---

27. వేంగిచాళుక్యులు (ఆంగ్లము) నేలటూరి వెంకటరమణయ్యగారి రచన పుట 3.
28 న. క. పుట 115.

"బూజ్యపాద (క్రీ. శ. 470), దండి (ఏడవశతాబ్దము), నాగార్జున (ఎని మిదవశతాబ్దము), ఆదిపంప (941), పొన్న (950), రన్న (993), రాజాదిత్య (1120), మైదునరామయ్య, మోళిగయ్య, మరుళదేవ, మల్లికార్జునపండితారాధ్య (1160), హరీశ్వర, రాఘవ, కెరెయపద్మ రుసు (1165), చక్రపాణి రంగనాథ (1195 ?) పోలాళ్వ దండనాథ (1223), భీమకవి (1?69)".

నన్నయభట్టునకును తిక్కనకును మధ్యనున్న రెండుశతాబ్దముల కాలములోను మనకు అయిదారుగురు కావ్యులపేర్లకంటె తెలియుట లేదేమో? ఆనాటి శాసనములు పెక్కున్నవి. కాని శాసనకవుల పేర్లు తెలియుట లేదు. అప్పటిలో ఇన్నూరుమంది కవులకు తక్కువ యుండియుండరు. అది అతిశయోక్తిగా భావింపరాదు. కాకతీయ ప్రతాపరుద్రుని (క్రీ. శ. 1300 ప్రాంతము) యాస్థానమున[30] ఇన్నూరు గురు కవులుండెడివారు. రాజ్యములోని చిల్లరరాజుల కవిత్వపోషణ నిం దెత్తుకొనుట లేదు. మడికిసింగన్న (క్రీ. శ. 1420 ?) వ్రాసిన సకలనీతి సమ్మత మను సంకలనగ్రంథములోని కొందఱు కవులు తెలి యుట లేదని మన మెఱుగుదుముకదా! కాఁబట్టి పూర్వకాలమం దుండిన వాఙ్మయ మెంతయో బైటపడవలసి యున్నది.

రాజరాజనరేంద్రునకు పూర్వమున్న తూర్పుచాళుక్యరాజులు కళలను ప్రోత్సహించిరి. దానార్ణవునకు,[31] రెండవ అమ్మరాజునకు విద్యాకలాపచతుర, కవిగాయక కల్పతరువు అను బిరుదము లున్నవి. కాని యానాటి కవులగ్రంథము లెచ్చట నున్నవో తెలియుటలేదు. క్రీస్తు పూర్వము 183 లో నుండిన ఖారవేలుఁడను జైనరాజు హాతి గుంఫశాసనములో తాము గంధర్వవేదవిదుఁడై, నాట్య, గీత, వాదిత, సందర్శన ఉత్సవాదులచేత కళింగనగరమును రంజింపచేసితినని వ్రాసు కొన్నాడు. అ దంతయును దేశభాష యైన తెలుగులో జరిగినదే కదా! ఆనాటి రచన లేవి? మనము తీవ్రపరిశోధన చేసి ప్రాచీనాంధ్రగ్రంథ ములను సంపాదింపవలసియున్న దని నా మనవి.

---

29. ఆ. సా. ప. ప. సం. 5—190.
30. ఆ. సా. ప. ప. సం 7—292.
31. ఆ. ప. మ. సం 4—1 పుట 107.

# శ్రీ పా ను గం టి

—శ్రీ శనగన నరసింహస్వామి

చ. పలికినపల్కు హాస్యరసబంధురమై యలవోక లేఖినిన్
గిలికినపద్య మాంధ్రకవి కేవలమందిర మై మనస్సునన్
దలఁచినమాత్ర వస్తువు నితాంతమనోహరరూపకంబు నై
వెలయఁగఁ జెల్లునెట్టి ఘనవిద్య ఘటించిన నిన్ దలంచెదన్.

సీ. నీ హాస్యవాఙ్నైపుణికి రూపకాభర
ణంబు "కంఠాభరణంబు" సాక్షి-
నీ కల్పనాకథానిర్మాణ మార్మిక
కళకుఁ "గోకిల" నాటకంబు సాక్షి-
నీ భక్తిరససృష్టినిత్యనవ్యతకు "రా
ధాకృష్ణ" నాటకోత్తమము సాక్షి-
నీ కరుణోక్తినిర్నిద్రముద్రకుఁ బ్రము
ఖము "పాదుకా" రూపకంబు సాక్షి-

గీ. నీ చమత్కారబంధుర నిర్వికార
సరససాహిత్యలక్ష్మీప్రచండభవ్య
విహరణమునకు సర్వాంధ్రసహృదయమతి
తర్పణంబులు "సాక్షి" గ్రంథములు సాక్షి. 2

ఆ. కండబలము గల్గి గుండెబలము గల్గి
కవనబలము గల్గి కవులు నాడు
నిన్నుబోంట్లు తెనుఁగునేలకు సత్కీర్తిఁ
దెచ్చి రాదినములు తిరిగి రావు. 3

ఆ. ఆంధ్రభాష జిహ్వాకాంచలనటి గాఁగ
దేవభాష దివ్యదీప్తి నొసఁగ
నాంగ్లభాష నీకు హస్తామలకముగా
నెదురులేక కవిత నేలితి కదె! 4

చ. ఒకయెడ మేఘగర్జగతి నొక్కెడ శైలఝరంబురీతి- నిం
కొకయెడ వెన్నెలంబలె మఱొక్కెడ మందసమీరమట్లు నీ
ప్రకటకవిత్వశయ్య బహుభంగులు సూపుచుఁ బ్రుష్పాడుల్ల నా
లుకలకు విందొనర్చును తెలుంగు లొనర్చినపున్నె మెట్టిదో! 5

క. అసదృశ "సాక్షి" గ్రంథ
ప్రసృమర శాశ్వతయశః ప్రపంచశరీరా!
రసవద్బూరిపకరచనా-
గ్రసరత్వనవీనభాస! కవిలోకరమణీ! 6

క. స్వస్థానవేషభాషా
ప్రస్థిరహృదయుం డనంగఁ బటుచండవిమ
ర్శస్థాపకుఁ డన నాంధ్ర
ప్రస్థలిఁ బేర్వడితి పానుగంటికవీంద్రా! 7

క. చిత్రాద్భుతవాగ్విభవల
విత్రిచ్ఛినైకసంఘవిషమాచారా!
ధాత్రీసురరత్నమ! సిం
హాత్రియగణనీయ! కుకవిమత్తేభహరీ! 8

క. "వాణీదాస కవీంద్రున్"
గానీ- "జంఘాలశాస్త్రి"ఁగానీ మఱి దు
ర్దీనున్ "గాలాచార్యున్"
గానీ "బొజ్జయ్యసెట్టి"ఁ గాని మఱతుమే! 9

చ. పుడమిని రామనామమునఁ బొంగనివాడును జంటివాని క్రొం
బుడిబుడిమాటలన్ ముదముఁ బొందనివాడును వర్ష ధారలోఁ
దడియనివాడునున్ భవదుదారమనోహరహాస్యసూక్తులన్
బడిపడి నవ్వి దోసిలిని బట్టనివాడును లేడు సత్కవీ! 10



# అజ్ఞాత కౌంతేయము

శ్రీ అయ్యగారి నరసింహమూర్తి.

[సంజయ రాయబారానంతరము జగదేకబాంధవుం డగు జనార్దనుండు పాండవపక్షమున సంధిసంధానోద్దేశమున కరిపురంబున కరిగి విఫలమనోరథుండై యుద్ధము తప్ప దని నిశ్చయించి తిరిగి వచ్చును. తదనంతరము కురుపాండవు లిరువురును ఎవరిబలమునకుఁ దగినరీతిని వారు సైన్యసమీకరణ మొనర్చుకొనుచుండిరి. అంగరాజును సూతసుతుండును నగు రాధేయుఁడు దుర్యోధనుని ఋణము దీర్చుకొనుటకు సమయ మాసన్న మాయెనుగదా యని యంతరంగమున ముద మందుచు నొకనాటిసంధ్యాసమయమున సూర్యున కర్ఘ్యము నిచ్చుటకై స్యందనం బధిరోహించి భాగీరథీతీరమునకుఁ దరలిపోయి యచట నున్న యొకవటవృక్షచ్ఛాయను రథంబును నిలిపి నదిలోనికిఁ బ్రవేశించి యనుష్ఠానంబును నిర్వర్తించి రథారోహణమునకై తీరమునకువచ్చుచుండగా మంద్రస్వరములో కుమారా! "ఆగు మాగు" మనుపలుకులు వినఁబడును. కర్ణుడు నలుదెసల పరికించి పిఱిందిదెస మేలిముసుగులో నున్న యొకయతివను గాంచి సమీపించును]

కర్ణు:-(సమీపించి) అమ్మా! నీ వెవరవు? 'కుమారా!' యని పిలిచి యిపు డేమియు పలుకక మౌనము వహించితి వేల?

కుంతి:-(కంపితస్వరముతో) వత్సా! ఎన్నిదినములనుండియో నీ కొకవిషయము నేకాంతముగాఁ దెలుపవలె నని యనుకొనుచుంటిని. నేటికి సమయము చిక్కినది. కర్మసాక్షిసమక్షమునఁ బలుకుచున్నాను. లోక మనుకొనుచున్నటుల నీవు రాధేయుఁడవు కావు నాయనా! పాండవాగ్రజుఁడవు.

కర్ణు:- (ముఖము వెలవెలఁబార) తల్లీ! నేను సూతసుతుఁడ నని నన్నాతఁడు గంగనుండి కొనితెచ్చి పుత్రప్రేమచేఁ గడుగారాబముగఁ బెంచినాఁ డని లోకులు నన్నుగూర్చి వింతగాఁ జెప్పుకొందురు

నాజన్మ మెట్టిదైనను నేను సూతునింట పెరిగినవాడ నగుటచేత నే కదా నాడు ద్రౌపదీస్వయంవరసమయమున బరిభవింపబడితిని. ఊహ జనించినదాదిగా నామాతృమూర్తిని దర్శింపవలె నని, ఆ అమృతహస్త స్పర్శలచే దీవన లందవలెనని ఆ మెధుమధుర మగుమాటలను వీనులార వినవలెనని యెన్నెన్నివిధములుగనో కలలుగంటిని. కాని యవి దరిద్రునిమనోరథములవలె వ్యర్థము లైనవి. ఎందులకో యీనాటి మీమాటలు నా కాప్తులమాటలవలె విచిత్రానుభూతిని గలుగఁజేయు చున్నవి. హృదయ మానందవిషాదములతో జలతరంగములవలె నున్నది. అనేకపర్యాయము లామె నా భావనావీథులలో విహరించినది గాని కన్నులార గాంచుభాగ్యముమాత్రము కలుగలేదు. ఇఁకఁ గొలఁదిదినములలోనే యీ మేను రాఁబోవురణమున దుర్యోధనుని ఋణముఁ దీర్ప నర్పింపఁ బడనున్నది. ఈ నిర్భాగ్యుని కిఁకఁ గన్నతల్లిని గాంచుభాగ్యము కలుగదు కాఁబోలు (అని కన్నుల నశ్రులు రాల్చును.)

కుంతి :– (గద్గదికముగా) కన్నె ప్రాయమున నర్కుని వరప్రసాద మున బిడ్డను గని గంగలోఁ గలిపిన నీ మాత యింకను బుడమిపైఁ బొగులుచు బ్రతికియే యున్నది నాయనా! నా చేతిలోఁ గన్నబిడ్డను గలిపినపుడు మాతృహృదయ మెంత క్షోభించినదో కర్మసాక్షి యగు సూర్యభగవానుఁడును ఆ అంతరాత్మయునుమాత్రమే యెఱుంగును. ఆ గంగాభవాని చల్లని దగుటచేతను గొంతల కడుపుతీపి యెఱింగిన దగుటచేతను బిడ్డను గంగపాలు గావించినను ఆగ్రహింపక కనికర ముతో ని న్నొకయమ్మచేతఁ బెట్టినది.

కర్ణు :– అయినచో నాతల్లి యెచట నున్నది. కడసారిగానైన తల్లిని గాంచుభాగ్యమున్నచో నది యొకయదృష్టమే గదా!

కుంతి :– కుమారా! హస్తినాపురవీథులలో నీచారుమూర్తి ప్రవర్తిలునపుడు పలుమార్లు పరికించియు నేఁ జేసిన దుష్కృత్యము

తలఁపునకు రాఁగా నోట మాటరాక నే డిట కొంటరిగ వచ్చి కలిసి కొంటిని. (అని చేతులతో ముఖమును గప్పుకొని రోదించును.)

కర్ణ :- అమ్మా! నే నదృష్టవంతుఁడను. నా పుట్టుక చరితార్థమైనది. కనులకు సఫలత చేకూరినది తల్లీ! (పాదములపై వ్రాలును) కుంతియును గర్ణుని లేవఁదీసి యక్కునకుఁ జేర్చుకొని మేను నిమురును. అశ్రువులు శిరముపైఁ బడుచుండగా నిరువురును కొలదికాలము సర్వమును మఱచియుందురు. భాగీరథీతీరమునుండి వచ్చుపిల్లగాలుల వలన నామె మేలిముసుఁగు కొలఁదిజారగాఁ గర్ణుఁ డామె మోమును గాంచి కుంతి యని గుర్తించును. అపు డతఁ డతిశయించిన యానందముతో) ఆహాఁ! ధనుర్విద్యావిశేషముచే విశేషఖ్యాతి నార్జించిన అర్జునునిఁ గన్నతల్లివా! పాండురాజు దేవేరివా! అట్టి నీవు నా జనయిత్రివా! అమ్మా! ఎంతటిసుకృతము. పాండమధ్యముండగుకిరీటి నా తమ్ముఁడా! ఎంతగర్వింపఁదగినవిషయము? పదునెనిమిది యక్షోహిణులబలములోఁ గలవీరు లిరువురును నీతనయులే నమ్మా! శౌర్యపరాక్రమములతో నలరారుపుత్రులను బడయుటకంటె క్షత్రియ కులగాంతకు వలసిన దేమున్నది. అమ్మా! నీజన్మ సఫల మొందినది. ఇఁకఁ దల్లిఋణమును దీర్ప జేయఁదగినకార్య మున్నచో నీకొడుకు తప్పక చేయఁగలఁడు. జాగుసేయక చెప్పుము.

కుంతి :- (దుఃఖ మతిశయింప) బిడ్డా! ఇంతకుమున్నె నీవు రాఁబోవురణమున దుర్యోధనుని ఋణమును దీర్చుటకై నీతనువు నర్పింప నున్నట్లుగా బలికితివి గదా! యుద్ధ మనఁగా నొకరిరువురితోఁ బోవునది గాదుగదా! ఎన్నిప్రాణములు బలియగునో? ఎందఱు తల్లులు శోకసంతప్త లగుదురో! ఎన్నినల్లపూసలపేర్లు మంట గలియునో! నీ వెఱుంగనిది కాదు. పాండవులు నీసహోదరులు. దుర్యోధనుఁడు నీ యనుంగు చెలికాడు. ఆతఁడు నీమాటల నెన్నడు దిరస్క-

రింపడుగదా! బిడ్డ లెంద ఱున్నను తల్లి ప్రజలయెడ విరోధము పాటించునే! కన్నబిడ్డ లిరువురును యుద్ధమునకు సిద్ధపడగాఁ జూచుచు నూరకుండగలదా! నీవు దయాధర్మము లెఱింగినవాడవు. జనక్షయ మైననేలను గొని రాజ్యము చేయుట ఎవరికొఱకు! కావున ధర్మజా గ్రజా! సర్వజనులహితమును గోరి సంధియత్న మొనరింపుము. నీవు పాండవపక్షమునఁ జేరుట మేలైనకార్యము.

కర్ణు :- అమ్మా! ఒకరికొకరు కా మనుకొన్న మనలను విధి యీవిధముగ నే డిచట నేకాంతముగాఁ జేర్చినది. మనము చాల నదృష్టవంతులము. ఇక నేడు నేను సుయోధనుని వీడి వచ్చుట పాడి గాదు. ఎందులకన -

ఉ॥ సూతసుతుండు వీ డనక సూనుల తమ్ములకంటె నాకు సం
ప్రీతి యొనర్చి తేజమును పెంపును నాటికినాటి కగ్గలం ।
బై తనరార నన్ను తనయంతటిమానిసిఁ జేసియుండ నే
నే తగవూది యీ కురుకులేశ్వరుఁ బాయుదు చెప్పుమమ్మరో!
అంతియ కాక-

క॥ "కడిదిపగ ఱనే దెప్పగ కడవంగానీదఁ దలచుకౌరవనాథుం
జెడుగాక యంచు ని త్తఱివిడువదగునె యతనివలన వెలసినవాడన్"

క॥ "కౌరవులచేత గుడిచినవారికి నిది సమయమెట్టివారును సంగ్రా
మారంభంబునఁ బాయుదురే రాజులు మనలఁ దిట్టరే యట్లయినన్"

ఇం కొకమాట: కర్ణార్జును లిరువురును ప్రతిద్వంద్వు లనుట లోకమున నున్నమాట నీవును వినియుందువు. కావున-

ఆవె॥ "ఏను నర్జునుండు నెక్కటెక్కటి దలపడకయున్న నగరె పుడమి
జనము లందు నాకు వచ్చు టతనికి నపకీర్తి యనిన నాకు
వేఱె యడుగ నేల?"

ఆ॥ వె॥ "విజయువిక్రమంబు విఖ్యాత మైయుండ; ఏను గొంతికొడుక
భానుజుండ, ననుచు నతని చేరనరిగిన నతనికి వెఱచి పోయె
ననరె వేయునేల ?"

ఇరుపక్షములవారును సైన్యసమీకరణము చేసికొని యుద్ధము నకుఁ దలఁపడ సిద్ధముగా నున్నారు. అట్టితఱి సుయోధనుని యుద్ధ విముఖునిగాఁ జేయ వలనుపడదు. చక్రధరునంతటివాడు సంధిసేయ సమకట్టి విఫలమనోరథుండై వెడలినాఁడు. ఇప్పటి శకునంబులంబట్టి జూడ పాండవులకు జయము తథ్యము కనుక నే నవశ్యంబును దుర్యో ధనునకై నీకొడుకులతో బెనంగెదను.

ఆ॥ వె॥ "సవ్యసాచిచేత చచ్చుటయును కీర్తి
కరమ అతఁడు లోనుగాగ నేవు
రేను లోనుగాగ నేవురుగాని నీ
కొడుకు లార్వు రనుట విడువు మింక"

నేను నీతనయుఁడ నైనందులకు బాంధవ్యము తెలిసినందులకు నీవు కోరకుండగనే నీయఁగలవర మొక్కటియే. ఆహవమునం దొక్క యర్జునునిదక్క మరెవ్వరు చేఁజిక్కినను జంపను. కాని యొక్క కోరిక తల్లీ! యుద్ధమునకుముందు నాతమ్ము లెవ్వరికిని నావిషయము దెలుపవలదు. ఎందుల కన-

తే॥ గీ॥ "ధర్మతనయుండు తాను నాతమ్ముఁ డగుట; ఎఱిగెనేనియు
సామ్రాజ్య మేలపూను; అట్టిధార్మికుఁ డాధిపత్యంబు చేయవ
లవదే శాశ్వతంబుగ వసుధయెల్ల".

యుద్ధమున నే స్వర్గ మలంకరించినయెడ ధర్మజునకు నాపై దయ యున్నచో తర్పణము నీయఁగలడు. ఇదియే నా కడసారికోరిక. పాండవులకు జయము తథ్యము. బెగ్గడిల్లకుము. (అని పాదములకు నమస్కరించి రథారోహణము సేయపోవుచుండును.

కుంతి :- (కుంతియును నవనతశిరస్కయై దుఃఖపూరితాశ్రు నయనములతో నడుగులో నడుగిడుచు) కర్ణుడా! అట్లే కానిమ్ము. ఇది కౌరవక్షమునకే వచ్చినది. దైవము బలీయమై యున్నది. నీవు పాండవచతుష్టయమున కభయదానము చేసితిని. దానినే పాలింపుము. (ఇరువురు నిష్క్రమింతురు.)

సమాప్తము.

---

# గాంధితాత!

శ్రీమతి డి. నీలమణి.

శా. మాపై మా కొకనమ్మకమ్ము చిగురింపన్ బోధ గావించి, మా
లోపమ్ముల్ సవరించి, నాయకుడవై లోకమ్ము విభ్రాంతమై
నీ పూన్కిన్ గమనింప తెల్లదొరలన్ గెంటించి నా వీవు!! సం
ప్రాపించెన్ హరిచందనోపమలసత్ప్రఖ్యాతిసౌరభ్యముల్.

సీ. జాత్యహంకారదౌష్ట్యానలజ్వాలకు
వారుణాస్త్రమ్ము తావకమనీష;
పారతంత్ర్యపిశాచపరిరంభవాంఛకు
బడబాగ్నికీల తావకమనీష;
దారిద్ర్యదుర్భరతాండవారభటికి
భరతవాక్యమ్ము తావకమనీష;
హింసావిశంకటహేవాకహేతికి
ప్రబలకవచము తావకమనీష;
శాంతిసత్యదయాకాంతకాంతికలిత
వనితభారతాశారమావాస్తవికత
తావకమనీషచే వసుంధరను విరిసి
కప్పురపుదావి విరజిమ్మె గాంధితాత!!!

శా. ఈ పుణ్యావని నంధతామసములో హింసించి, యేడ్పించి సం
తాపాంభోధిని ముంప నెంచిన దురంతప్రాభవాధిక్యమున్
మాపంజాలిన నీ నిశాతమతి సంభావ్యమ్ము ధన్యమ్మహో!
"బాపూజీ"యని యొక్కసారి స్మరియింపన్ స్వేచ్ఛ సిద్ధింపదే?!'

## మహాకవి – "గోవర్ధనం వేంకటనరసింహాచార్యులు"

రచన: శ్రీ రంగాచార్య.

"శ్రితరక్షాకరణప్రతాపగిరిలక్ష్మీనారసింహాంఘ్రి పూ
జితవైశేష్యరమాగతామితవచస్స్వీకారసంభూతస
చ్చతురార్థప్రతిబంధ బంధరచనా శయ్యాచమత్కార, సం
గతుఁడన్, విద్వదనీకహృన్ముదితవాక్చాతుర్యధుర్యుండ శ్రీ
పతి సంపూర్ణకటాక్షలక్షిత చతుర్భాషా విశేషార్థ శో
భిత సద్గ్రంథ కవిత్వతత్వఘటనా వేద్యుండ, శ్రీవైష్ణవో
న్నత గోవర్ధనవంశవార్ధిజనితానందు రామానుజా
ర్యతనూజుండ, ధరాభుజార్పితపదార్థస్ఫారవస్త్రాద్యలం
కృతుఁడన్, సర్వజనైకమోదకరసంగీతక్రమోపక్రమాం
చిత, ధారాళపురాణకల్పకథనాశీలప్రవీణుండ దూ
షికపాషండమతప్రచండ గజరాట్సింహుండ నంభోధిము
ద్రితభూమిస్థితరాజమాన్యతముఁడన్ శ్రీనారసింహార్యుఁడన్."

అని – స్వవిషయమునుగూర్చి యీవిధముగఁ జెప్పుకొన్న మహాకవి–"గోవర్ధనం వేంకటనరసింహాచార్యులు. ఈయన నల్లగొండ జిల్లాయందలి మిర్యాలగూడెంతాలూకాలో గల 'విభురాముపేట' యను గ్రామవాసుఁడు, శ్రీవైష్ణవుఁడు, శ్రీవత్సగోత్రుఁడు, రామానుజాంబా రామానుజాచార్యుల పుత్రుఁడు – సంస్కృతాంధ్ర భాషలయందే గాక– ఫారసీ, ఉర్దూ భాషాపాండిత్యము గలవాఁడు, బహుగ్రంథరచయిత కాని ఒండు రెండుదప్ప నన్నియు నముద్రితములు. (ఈయనకాలము—క్రీ. శ. 1856—1935) ఇవి – 'ఆలయమం దముద్రితములై తెరచాటున డాగియున్న బిబ్బీలవిధాన' గలవు. ప్రథమమున రచనల నన్నింటిపేళ్ళ నొసంగి యనంతరము వానిఁగూర్చి తెలుపుదును. 1

1. "గోలకొండ కవుల సంచిక" (1934) యందు 384 పుటయందు గూర్చి గలదు. కాని యందు కృతులను పేర్కొనలేదు.

1. సారంగశైలదశరథరామశతకము, 2. ప్రతాపగిరిమాహాత్మ్యము, 3. సారంగశైలమహాత్మ్యము, 4. అంబరీషోపాఖ్యానము, 5. నిడిశెనమెట్లకందాళవారిచరిత్ర, 6. వామనచరిత్ర, 7. మాధవరయజ్వచరిత్ర, 8. తిరుమంగయాళ్వారుచరిత్ర (ఆంధ్రయక్షగానవాఙ్మయచరిత్ర నీయక్షగానము పేర్కొనబడలేదు.) 9. అంత్యనియమపదశతకము, 10. మానవశతకము, 11. భావనాశతకము, 12. లక్ష్మీనృసింహవిలాసము, 13. అజామిళోపాఖ్యానము, 14. గొల్లకలాపము, (అముద్రితము. ఆం.సా.ప.నం. 3760) 15. ప్రతాపగిరిమాహాత్మ్యము, 16. జాంబవతీచరిత్ర, 17. శంకరగురూపాఖ్యానము, ఆం. సా. ప. లో 3760 నెం. గల గ్రంథము 'సుంకరి కొండయ్య' రచనగా పరిషత్తు వారి పట్టికయందుఁ గలదు. కాని యితఁడొక పాత్రయే, కొండయ్య పేరు గలభాగ మిపు డుత్పన్నము, 28 యాకు 2వ ప్రక్క గోవర్ధనం వేంకటనరసింహాచార్యుఁడే రచయిత యని యున్నది.[2]

ఇంతవరకు కొన్ని సమగ్రముగను, మఱికొన్ని యసమగ్రముగను లభించినవి. 1, 12, 13, 14 సంఖ్య గలగ్రంథములు మాత్రము ముద్రితములు, కొన్నిరచనలు చాటువులు, వీరికుమారిని యజాగ్రత్త వల్ల నష్టమైన వని తెలియుచున్నది. (వీరి కుమారులు – 'గోవర్ధనం అళహసింగరాచార్యుల'వారు – విభురాముపేటయందుఁ గలరు. ఎన్ని లేఖలు వ్రాసినను కనీసము ప్రత్యుత్తరమైన నొసంగలేదు.) బహుగ్రంథ రచయితయే కాక కొన్నిగ్రంథములఁగూడా బరిష్కరించినాఁడీకవి. అం దొకటి "కుముదవల్లీవిలాసము",[3] దీనికర్త దేవరకొండ

2. చూ. "ఆంధ్రయక్షగానవాఙ్మయచరిత్ర Dr. యస్వీ. జోగారావు గారు 366-367 పుటలు.

3. ఈ గ్రంథము 1925లో వరంగల్లుజిల్లా 'ఇరుమర్తి'లోఁ బ్రచురింపబడినది. ద్వాదశాళ్వారులలో నొకఁడగు 'తిరుమంగయాళ్వారుల' చరిత్ర యిది. ప్రశస్తమైన రచన. [దీనిని గూర్చి నా వ్యాసము. చూ. భారతి. 1967-ఏప్రిల్ — "పానుగోటి జగన్నాథరావు - కుముదవల్లీవిలాసము"-] మావద్ద నొకప్రతి గలదు.

తాలూకాకు జెందిన 'పానుగోడు' గ్రామవాస్తవ్యుఁ డగు 'పానుగోటి జగన్నాథరావు'. ఇఁక నీ గోవర్థనం వేంకటనరసింహాచార్యుల రచనలఁ గూర్చిఁ దెలుపుచున్నాను.

1. సారంగశైలదశరథరామశతకము :— ఇది 1925 లో నైజాం ముద్రాక్షరశాలయందు, నల్లగొండలో ముద్రింపఁబడినది. '(శ్రీ)మత్సారంగశైలదశరథరామా' అను మకుటముతోఁ గల కంద పద్యశతక మియ్యది.

2. ప్రతాపగిరిమాహాత్మ్యము :— [4] ఇది యముద్రితము. ఆదియందు కొంత భాగము నష్టమైనది. ప్రబంధము పూర్తిగా లేదు. కవి దీనిని పూర్తిగా రయింపలేదో, లేక, లేఖకుఁడు పూర్తిగా వ్రాయ లేదో తెలియదు. ఉన్నంతవరకు ప్రతివివరములను-ముఖ్యవిషయముల నొసంగుచున్నాఁడను.

గద్యపద్యములు :

ప్రథమాశ్వాసము — 116 (కొంత లేక)
ద్వితీయాశ్వాసము — 109
తృతీయాశ్వాసము — 182 (అసమగ్రము
— ఇంతవరకే గలదు.)
మొత్తము 407 గద్యపద్యములు.

కవి తనయభిమానదైవ మగు ప్రతాపగిరిస్వామిమాహాత్మ్యమును వర్ణించుచు దీనిని రచియించి యాస్వామి- యనగా ప్రతాపగిరి లక్ష్మీనృసింహస్వామి కంకిత మొనర్చెను. ఈ ప్రతాపగిరి [యను పర్వము] మిర్యాలగూడెంతాలూకా 'చిన్నగూడెము' ['సిరిసనగండ్ల'] అనఁబడు గ్రామమున కీశాన్యభాగమునఁ గల యొకపర్వతము, ఇందు స్వామి స్వయంవ్యక్తుఁడై వెలసినాఁడు. నేటికిని యాస్వామికి నుత్స

4. 'ఆంధ్రయక్షగానవాఙ్మయచరిత్ర' యందు, ప్రతాపగిరిరామమాహాత్మ్య మని వ్రాయుట పొరపాటేమో !

వాదులు జరుగును. ఈ ప్రబంధమున ముఖ్యకథ- ఉత్తముఁ డను రాజపుత్రుఁడు ప్రతాపుఁ డనుప్రభువుది. ఇది పూర్తిగా పూర్వకవుల ప్రబంధఫక్కి ననుసరించి వ్రాయబడినది. కవివంశవర్ణన, గురుస్తుతి మొదలగునవియే కాక 'దేవరకొండ'ను గూర్చియుఁ గలదు. శృంగార వర్ణనలు హెచ్చుగా గలవు. శైలి తెలియుటకై ఒండురెండు పద్యముల నుదహరించుచున్నాను.

సీ. రతిరాజ రాజ భారత రాజులను బోలు
మతికళాసౌందర్యమహిమవలన,
భాను భార్గవశీత భానుత్రయము నేలు
రుచితపస్స్వాధ్యాయరూఢివలన,
శ్రీకుమార కుమార మాకుమారుల బోలు
శౌర్యధైర్యౌదార్యచర్యవలన,
సుర రాజ రాజభూసుర రాజులను బోలు
విద్యాకళాపూర్తివైభముల.
తలప సామాన్యుఁ డౌనె భూతలపవిత్ర
చిత్ర చారిత్రయుత పద్మనేత్రపాద
యుగళసాహస్ర పత్రసంయోగభక్తి
యుతుఁడు, శ్రీయుత్తమాఖ్యరాజోత్తముండు. (1-36)

తమోవర్ణన

మ॥ కకుబంతంబుల నిండె గాఢతనుముల్ కాదంబరోలంబి కా
క కదంబప్రతిబింబకోకిల బలాకాఖంజరీటా తసీ
పిక కాకోదర నీలకంఠ మదకుంభివ్రాత కాలానలాం
బక కాకోజ్జ్వలకాలభైరవ ధనుస్స్ఫారంబులై యత్తరిన్. (2-42)

నిరోష్ఠ్యసీసము :—

దీనరక్షణచర్య ధృతిజితాహార్యన, దీనశిక్షణశౌర్య తే జోహారు;
రాజఖద్యోతాక్షరక్షోహరణరాజ, రాజాంచితకటాక్ష తే జోహారు,
ధృతిచారుకౌశేయ,ధృఢకాయకరతల, స్థితఘోరకాంక్షేయ తేజోహారు,
రాజితోద్యద్గుణారచితలోకత్రాణ, తేజోల్లసద్దేహ తే జోహారు,

త్రిగుణసంగతహృత్కంజ తే జోహారు,
రాజదంఘ్రిసరోజాత తే జోహారు,
నైజసౌశీల్య గుణహార తే జోహారు,
ఆజగల్లోలచారిత్ర తే జోహారు. (3-113)

3. సారంగశైలమాహాత్మ్యము:— ఇది నాల్గాశ్వాసముల ప్రబంధము, కవిగారి స్వహస్తలిఖితప్రతియే మావద్ద గలదు. ఇందలి గద్యపద్యములు సుమారు 500, కవి దీనిని సారంగశైలసీతారామచంద్ర స్వామి కంకిత మొనర్చెను. మాస్వగ్రామమైన-నల్లగొండ తాలూకా లోని 'చందుపట్ల' యను గ్రామమునకుఁ దూర్పుభాగమునఁ గల 'బండపాలెము' అను చిన్నగ్రామమునకుఁ దూర్పుభాగమునఁ గలదీ సారంగశైలము. నేటికిని వ్రతిచైత్రమాసమున స్వామివారి యుత్స వాదులు నిర్వహింపఁబడుచుండును. ఇది యెత్తైనపర్వతము. పైన నొకపుష్కరిణీ గలదు. ఒక లోతైనగుహయందు- సీతారామచంద్ర స్వామి వెలసియున్నాఁడు.

ఈ ప్రబంధమందలి ముఖ్యకథ:- మేరుపర్వతమునకు, సారంగ, భద్ర, వీరు లనుమువ్వురుపుత్రులు, సారంగుఁడు ప్రత్యక్షీకృతవిష్ణుఁడై భగవదనుగ్రహమును సంపాదించి - యిచ్చటకు [బండపాలెము] వచ్చుట, అందుపై- (శ్రీ)రామచంద్రస్వామి వేంచేసియుండుట, యను నది యిది కల్పిత మైనప్రబంధమైనను, ప్రౌఢకవితాపాటవముచే నొప్పారుచున్నది; కవివంశావతారవర్ణన సంగ్రహముగా ముగించెను. చందుపట్లగ్రామవాస్తవ్యులైన పానుగంటి శంకరరావుగారి ప్రార్థన ననుసరించి తా నీ ప్రబంధము వ్రాసినట్లుగాఁ గవి పేర్కొనును; రామాయణకథ యిందు సంగ్రహముగఁ గలదు, గుహుఁడు శ్రీరాముని స్తుతించు సమయమున 'నిరోష్ఠ్యదండకము'ను రచించెను.[5] మచ్చున కీగ్రంథమందలి పద్యములు.

5. ప్రప్రథముముగా నిరోష్ఠ్యదండకమును వ్రాసినకవి కొఱవి గోపరాజు- చూ. సింహాసనద్వాత్రింశిక 4-24. (ఆంధ్రసాహిత్య పరిషత్ప్రచురణము.) ఇతనిత ర్వాత నిరోష్ఠ్యదండక రచయిత మనప్రస్తుత కవిగా వచ్చును. దండకవిశేషములను, చూ-"ప్రతిభోద్భవ" సం-2; సం-1.

క. 'హార్ష్ణోక్తులఁ బొగడుచు సుమ
వర్షంబులు గురిసి, మధురవాగ్గీతరవో
త్కర్షముగ నాడి పాడిరి
మర్షము విడి సురలు గగనమండల మద్రువన్.' (1-35)

క. దాశరథి యగుట రయమున
దాశరథుల్ వచ్చి రనఁగ దా శరధి ధనుః
కౌశల్యుఁ డగుచు వచ్చి, స
దా శరథికి శరధి నెదురుదాకిన సరణిన్. (2-46)

చ. గరుఁడనిమీఁది కేఁగుఫణికాంతుని క్రైవడి కేసరీముఖం
బరసినసామజంబుగతి నగ్నిశిఖాస్పృశ మా పతంగ శే
ఖరుగతి పుండరీకమును గాంచినలేడి తెఱంగు తేజమునన్
దరగిన జామదగ్ని కడు తాపము నొంది కృశించి ముందటన్. (3-56)

4. అంబరీషోపాఖ్యానము :—[6] ఇది యక్షగానము నామ మాత్రావశేషితము. దీనిని గూర్చినవివరములు తెలియరాలేదు. కవిగారిపుత్రునియొద్ద నొకప్రతి గలదని మా తండ్రిగారు దెల్పుచున్నారు.

5. నిడిచెనుమెట్లకందాళవారిచరిత్ర :— ఇది నిందాకావ్యము. ద్వాదశాశ్వాసపరిమితిగ వ్రాసెననియు- అది పూర్తిగా లభ్యముగాక నందలి గొన్నిపద్యములు మాత్రము లభించిన వనియు మా నాయనగారు - శ్రీరాఘవాచార్యులుగారు తెల్పినారు. మావద్ద ఆపద్యములు సుమా రేఁబదివఱకుఁ గలవు.

ప్రబంధరచనాకారణములు :— 'నల్లగొండ' జిల్లాయందలి 'నిడిచెనమెట్ల' యనుగ్రామమందు రత్నమాచార్యు లనువైష్ణవా

6. 'ఆంధ్రయక్షగానవాఙ్మయచరిత్ర' — "అంబరీషరసాభ్యుద్భిజము" గా పేర్కొనెను. సరిగాదు. (చూ. 367 పుట)

గ్రిణికి నేడ్గురుపుత్త్రి లుండిరట. వీ రీకవివర్యునిపైఁ ద్వేషభావముఁ గలవారయి-పాండిత్యహీనులు గావున-నెవరో పంతునివలన గొన్ని పద్యములను వ్రాయించి (ఈ గోవర్థనాచార్యులవారిని దూషించి) 'ఉరిశాయపాలెము' నందు జరుగుచున్న భాగవతసప్తాహమందుఁ బ్రిచార మొనర్చిరఁట. ఈవిషయమును కవిగా రెఱింగి వారిపుట్టు పూర్వోత్తరములు. చరిత్రనీచకార్యములువివరించుచుకొద్దిదినములలో నీప్రిబంధమును వ్రాసి (పాటలు, పద్యములను బ్రివేశపెట్టి) అనల్ప ప్రిచారము గావించిరట, ఇది దెలిసి వా రంత యీతనిని క్షమాపణలు గోరుటమూలకముగ కవిచే యీగ్రింథమును బయటకు రానీయలే దని వినికిడి. అట్టిదానియందలి పద్యములను కొన్నింటిని చేర్చుచున్నాను.

చ. "నిడిచెనమెట్ల రత్నయకు నీచులు పుత్త్రిలు బుట్టి రేడ్వు రీ
పుడమిని, దుర్గుణవ్రితులు, పుణ్యవిహీనులు, బంధుదూషకుల్,
విడువక సజ్జనావళులవిత్తముల న్హరియించుచున్ మిదిన్
గడుసుదనంబునం దిరుగుకాటకు లెరిక వారినామముల్
కడువడి చెప్పెద న్వినుఁడి, గాథవచస్థితి, లోకు లందఱున్."

ఉ. "యాముననామధేయుఁడు దురాత్ముఁడు, వేదయ దుష్టచిత్తుఁడై
కాముకుఁడై నవర్దన, యిఁకన్ నరసాఖ్యుఁడు, సింగరాఖ్యుఁడున్
ధూముగ మద్యమాంసములుఁదూఁగి భుజింపుచు మత్తచిత్తులై
భూమిని దుర్యశంబు గొని పొర్లుచునుండు శరణ్యగాఁడు, యీ
సామయనామకుం డిటుల సప్తకము, న్మరి వారిచర్యలున్
వేమరుఁ జెప్పఁగా వినుఁడి విప్రులు సజ్జనులున్ నృపోత్తముల్."

సీ. "కేవలమును నీలగిరిసీమలోపల
నిడిచెనమెట్లలో నిలిచియున్న,
కందాళరత్నయగారికి నేడ్గురుఁ
గొడుకులుఁ బుట్టిరి కుటిలమతులు,

భాగవతద్రోహపరులు, బంధుద్వేష
కరులు, దుర్వర్ణసంకరులు, సాధ
నాంతరమంత్రతంత్ర క్రియాయుక్త
మాయాప్రసంగావమానధనులు,
కంస, శిశుపాలపౌండ్రక కాలయవన
ఖరజరాసంధహైడింబకక్షపాట,
రూపములఁ బుట్టినారు నిరూఢమతులు
తల్లిదండ్రుల కపకీర్తి యుల్లసిల్ల."

(సశేషము.)

ఈవిధము లైనపద్యములేఁ గాక, వచనములు, దరువులు, కోలాటపదములు, ఉయ్యాలపాటలు, దండకములు మొదలగునవిఁ గూడ నిందుఁ గలవట. మాప్రాంతమునఁ జాలమందికి కంఠపాఠముగా నిందలి ఘట్టములు వచ్చును.

6. వామనచరిత్ర:— మహాభాగవతమందలి 'వామనచరిత్ర' ఘట్టమును తీసుకొని చేర్పులు - మార్పులతో నొకప్రబంధకముగా రచించెనఁట. ఇందలిపద్యములని కీ॥ శే॥ మాతాతగారు జదువుచుండఁగ వినెడివారము. అప్పుడు వ్రాసుకొనలేని నా యజ్ఞత కిప్పుడు చింతిల్లుచున్నాను. 'కిం ప్రయోజనమ్'.

7. మాధవరయజ్ఞచారిత్రము :— ఇదియును గద్యపద్యాత్మకమై నిందాస్తుత్యలంకారముగ నున్నప్రబంధ మఁట. ఈ మాధవర నామగ్రామములు నల్లగొండజిల్లాయందును- పాలమూరు (మహబూబునగరము) మండలమునందును గలవు. కవి మిర్యాలగూడెం తాలూకాకు చెందిన మాధవర మనుగ్రామమున నొకవైశ్యుఁడు చేయించినయాగమునుఁగూర్చి యీగ్రంథమును వ్రాసెను. రచన నష్టప్రాయము. మాపెద్దలవల్లమాత్రము కొన్నిపద్యములు రక్షింపఁబడినవి.

ఆ యాగసమయమునఁ గవిపండితులు-బ్రాహ్మణులుఁ బడిన బాధలు నిం దభివర్ణితములు. ఉదాహరణమున కొకపద్దెము.

మ. అని పల్కన్వినుచున్నిరాశ గలిగెన్ హా!హా! యటంచున్ రయం
బున నేతెంచి, తదీయగ్రామమున "సంపూర్ణోపవాసంబు క
ల్గెను నీయూరి కిటేల వచ్చితిమి శంకింపన్ బనేమం"చు వై
*శ్యుని యేరండపుగాన్గకొట్టమున బంచున్ జింతన ల్సేయుచున్.

దీనిప్రతి యొకటి గా. అ. సింగరాచార్యులవారివద్ద నసమగ్రముగఁ గలదని వినికిడి.

౪. తిరుమంగయాళ్వారుచరిత్ర :— వైష్ణవులకత్యంత పూజ్యులుగాఁ జెప్పబడు ద్వాదశాళ్వారులలో నొక్కఁడైన తిరుమంగయాళ్వారుల (పరకాలుఁడు) చరిత్రము *యక్షగానసరణిలోఁ జెప్పఁబడినది. ఈ యాళ్వారులకథలు నేటికిని బహుళప్రచారమునఁ గలవు. తాళ్ళపాకవారి పరమయోగివిలాసము -ద్విపద, (క్రీ॥ శ॥ 1545 ప్రాంతము) నందు తృతీయచతుర్థాశ్వాసములలో పరకాలునిచరిత్ర మనుపేర నీకథ గలదు. ఇది పరమప్రామాణిక మైనరచన. కారణ మేమనగా కవికి :

"పనుపడ ద్రవిడప్రబంధంబుఁ జూచి
తెనుఁగున రచియింపు ద్విపదరూపమున"

అని స్వప్నరూపమున వేంకటేశ్వరుఁడే తెల్పెనఁట. అనంతరము ఈపరమయోగివిలాసము ననుసరించియే అనేకపద్య (ప్ర)బంధ రచనలు బయలుఁదేరినవి. అందు ముఖ్యముగా క్రీ॥ శ॥ 1564 ప్రాంతమున కొండవీటిని పరిపాలించిన సిద్ధరాజు తిమ్మరాజు. [ఈతఁ డళియరామరాయల మేనల్లుఁడు.] పద్యకావ్యముగ వ్రాసెను.

*"పండుకొనుచున్" అనుదానికిఁ "బంచున్" అని కవి ప్రయోగించెను. ఇది సరిగాదు. కాని మార్చుటకు వీలులేనిస్థలమునఁగలదు. "సిద్ధిర్లోకాద్వ్యశ్చా" గదా!

* డా॥ యస్వీ. జోగారావుగారి 'ఆం. య. గా. వాఙ్మయచరిత్ర'లో పేర్కొనఁబడని యక్షగానములలో నిదియొకటి.

పిడుగు వేంకటకవి యనునతఁడు (ఆధునికుఁడు) మూఁడాశ్వాసముల ప్రబంధముగా యీకథ రచించెను. ఇది యముద్రితముగా తంజావూరు సరస్వతీమహాలు పుస్తకభాండాగారమున నొకప్రతి యున్నట్లు తెలియుచున్నది.[7] వీనియన్నిటికన్న చదలవాడ మల్లనకృత విప్రనారాయణచరిత్ర, సారంగు తమ్మయ్యకృత వైజయన్తీవిలాసము అనల్పప్రచారమునఁ గలవు. ఇవి 'తొండరడిప్పొడియాళ్వారు'— 'భక్తాంఘ్రిరేణు' వనఁబడు విప్రనారాయణునిచరిత్రమును తెల్పునవి. దివ్యసూరిచరిత్ర, గురుపరంపరాప్రభావము, ఉపదేశరత్నమాల, ప్రపన్నామృతము లనుపూర్వగ్రంథములందు నీ యాళ్వారులచరిత్ర మభివర్ణితము.[8]

గోవర్ధనం వేంకటనరసింహాచార్యులవారు దీనిని పరమయోగివిలాసము నాధారముగా యక్షగానసరణిఁ జేసినట్లు తెల్పుచున్నను, కవిత్వముమాత్రము తెల్పుచున్నది. సమీపసామ్యములు గలవు.

పెద్దదొంగ యైనపరకాలుఁడు పరమభాగవతుఁడు దొంగిలించిన ద్రవ్యముతో భగవద్భాగవతార్చనసేయుట యితనిపని, యొకదినము ధనము లభింపకఁబోవుటచే చెట్టుక్రింద బల్లెము పాతి దానిపైఁ దూకి మరణింప యత్నము నొనర్చుచుండగా భక్తపరాయణుఁ డగు విష్ణుమూర్తి యీతనిని రక్షించి ఉపదేశముచేసి తిరుమంగయాళ్వారు లనుపేర తనభక్తకోటిలోఁ జేర్చుకొనుట యిందలి ముఖ్యవిషయము. సరసరచన, హాస్యప్రధానము తెలంగాణమున వెలసిన యక్షగానపద్ధతులతోఁ గూడిన రచన యుత్తమరచన యిది.

వైష్ణవులకు—భాగవతోత్తములకు భోజనములు పరకాలుఁడీవిధముగాఁ బెట్టెడివాఁడు.

---

7. చూ. 'విప్రనారాయణచరిత్ర' (ఆం. సా. పరిషన్ముద్రణ - 1938. పీఠిక 34వ పుట.)

8. విశేషముల నరఁగోరువారు చూ. ఆం. సా. పరిషత్తువారి 'విప్రనారాయణచరిత్ర' పీఠికల జూడునది. పీఠికాకర్తలు సర్వశ్రీ జయంతి రామయ్య మల్లాది సూర్యనారాయణ, నిడదవోలు వేంకటరావు గారలు.

మ॥ తిరుపణ్ణారములున్ వడ ల్పరుపుక త్తిర్కాయ చార్చామధుల్
పరమాన్నంబును కాయకర్యమధులున్ పచ్చళ్ళు దద్ధ్యోదనం
బరుడా శర్కర పొంగ లప్పడములున్ బాహుళ్య మైనట్టి స
ర్వరసాన్నంబులు వైష్ణవో త్తములకున్ వాంఛాప్రకారంబుగన్

ఇందలిపదములు నేటికిని శ్రీవైష్ణవుల గృహములయందు నిత్యవాడుకలో గలవు. [తిరుపణ్ణారములు=గారెలు - బూరెలు; వడలు=చిన్నవైనగారెలు; పరుపు=పప్పు; కత్తిర్కాయ=వంకాయ; చార్చామధు=చారు; ఇతరములైనపదములు నందఱు వాడునవే.

9. అంత్యనియమపదశతకము :— 'ప్రతాపగిరీణ్ణృకేసరీ' [గిరీట్+నృకేసరీ] అను మకుటమున నీపద్యము లొప్పారును. ముప్పది పద్యములు మాత్రమే లభించినవి. మిక్కిలిరసవంతమై నీతియుతమైన దీశతకము.

ఉ॥ "చక్కనలేనిచాన, కడు చందనమాననిసాన, నీరముల్
దక్కనిబాన, ఘోరమృగతండము లుండనికాన, తీర్థముల్
జిక్కని వాన, వైభవముఁ జెందనికాన, క్షుధాతురుండు తా
మెక్కనిబోన మేల, నది మేల ప్రతాపగిరీణ్ణృకేసరీ."[9]

10. మాధవాశతకము :— "కోటగిరికృష్ణుని బ్రోవగఁ జేయుమాధవా!" అనున దిందలి మకుటము. 'చందుపట్ల' గ్రామమున నప్పు డున్న వైశ్యుఁడు కోటగిరి కృష్ణయ్యను రక్షింపవలసినదిగా భగవంతునిఁ బ్రార్థించుట, యిందుఁ గలదు.

11. భావనాశతకము:— ఈశతకము లభింపలేదు. కవిబంధువు లెవ్వరివద్దనో గల దని మాపితామహులు ననెడివారు. ఇందలి పద్యములు గొన్నిఁ జదివెడివారు.

9. ఈ అంత్యనియమపదశతక పద్ధతియంతయు "పెమ్మయసింగధీమణీ" శతక పద్యపద్ధతి గాగలదు. అందులేని నీతులు నిందుఁ జెప్పఁబడినవి.

12. లక్ష్మీనృసింహవిలాసము :— ఇది ముద్రితము. ప్రతి మిక్కిలి జీర్ణావస్థలో నుండుటచే ముద్రణవత్సరముఁ దెలియుట లేదు. నల్లగొండ తాలూకా యందలి "పాలెము" గ్రామమున గల లక్ష్మీనృసింహస్వామి యుత్సవసమయమున భగవత్ప్రదక్షిణసమయమున అష్టదిక్ప్రహరీ పేర నీవృత్తములురచింపఁబడినవి. ప్రతి బాగులేనందున నుదాహరణము లీయలేదు.

ఇక్కవివర్యునిచేఁ బరిష్కరింపబడిన "కుముదవల్లీవిలాసము"నుఁ గూర్చిఁ దెలిపితిని.

వందలకొలది చాటుపద్యములుఁ గలవు. వాని నన్నింటిని సేకరించి సమయాంతరమునఁ బ్రచురింతును.

సూర్యారావుపేట తాలూకాయందలి 'బేతవోలు' సంస్థానాధిపతు లగు "శ్రీ తడకమళ్ళ సీతారామచంద్రరావు"గారి యాస్థానమున నీతఁడు కవి-పండితుఁడుగా నుండెడివాఁడు. ప్రథమమున నుదాహరించిన "శ్రితరత్నాకరణ"-యనుపద్య మాప్రభుసందర్శనసమయమునఁ జెప్పినదే.

ఈ తడకమళ్ళవారు కవులు- పండితులు గలరు. లీలావతీ గణితమును యీవంశపువ్యక్తి యైన గోపాలకృష్ణరావుగా రాంధ్రీకరించిరి. బహుగ్రంథరచయిత.[10]

గోవర్ధనం వేంకటనరసింహాచార్యులవారి శిష్యుఁడును 'విభురాముపేట' గ్రామవాస్తవ్యుఁడును నైన కృష్ణ గోపాలరెడ్డి యనునతఁడు 'నిర్వచనభాస్కరరామాయణము'ను వ్రాసెను.

వీని నన్నిఁటిని సంపాదించి- తరువాత వ్రాయుదును.

"జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి తేషాం యశః కాయే జరామరణజం భయమ్."

---

10. చూ. గోలకొండ కవుల సంచిక : లేదా, ఆంధ్రకవిసప్తశతి - 'బులుసు వేంకటరమణయ్యగారు'-(1956 ముద్రణ. పుట 238)

# ఆంధ్రదీక్ష

## ప్రథమాంకము — ప్రథమరంగము

ప్రదేశము:— విజయపాలపురమున ప్రతాపవర్మ గృహము.

ప్రవేశము:— భవానీకుమారి.

భవా:— చతురికా! చతురికా!!

(నేపథ్యమున) అమ్మా!

భవా:— ఏమిచేయుచుంటివే అక్కడ?

చతు:— (ప్రవేశించి) ఏమియును లేదమ్మా! ఆవైపు గదులలోని మన వస్తువులను దీసి మఱియొకచోట సరదుచున్నాను.

భవా:— ఏమి? ఎందులకు?

చతు:— అయ్యగారు మొన్ననే చెప్పినారమ్మా! ఎవ్వరో యీ భాగమున విడిది సేయుదురట.

భవా:— (సాలోచనముగ) ఎవ్వరే! ఈ లోపలియింట విడిదిసేయువారు? స్త్రీలా?

చతు:— కాదమ్మా! ఒక రాజకుమారుఁడట.

భవా:— (నవ్వుచు) పోవే, నీ మాటలకేమి? రాజపుత్రుడట! వీధిభాగము మాని యీలోన—కాంతాజనము మసలుచోట కాపురముండునట—ఊఁ—నమ్మదగిన విషయమే.

చతు:— సత్యమే భవానమ్మా! కొంతకాల మా రాకుమారుడిచట నుండ దలచినాడట.

భవా:— (నగుచు) ఊఁ, హూఁ, నీవు నిన్న రాలేదేమే? (హేళనముగ) ఆరాజతనూజు నాహ్వానించుటకై పంపబడితివి గాబోలునేమి? ఏమే— అంతియేనా?

చతు:— ఔనమ్మా! రాలేదు. మాపినతల్లిని జూచుటకై నిన్న కందారపురమునకు బోయితిని.

భవా:- పాపము! దానికి పెద్దకష్టము గలిగిన దని వింటిని. మన విజయపాలపురమున కామె నొకసారి తీసుకొని రాకపోతివా.

చతు :- నే నేమిచేయుదు నమ్మా! ర మ్మని చాల పట్టుబట్టితిని. ఇపుడు రా నని నిరాకరించినది. కాని- భవానమ్మా! చెప్ప మఱచితిని.కందారమునుండి యొక విచిత్రవస్తువును నీకు చూపింపవలయు నని తెచ్చితి నమ్మా!

భవా:-(సాభిలాషముగ) ఏమే!ఏమి తెచ్చితివే? చతురికా! ఏదీ.

చతు:- (పైటమాటుననుండి యొక తాళపత్రఖండము దీసి) ఇదెగో నమ్మా! ఇట్టివి వేనకువేలుగ తెలవాఱుసరికి కందాపురవీధులలో నెగురుచున్నవి. నలువురితో బాటుగ నేనును నొక ముక్కను సంగ్రహించితిని.

భవా:- (పత్రము గైకొని లోలోన బఠించుకొనును)

చతు:-చక్కగ పైకి జదువ వేమమ్మా! నాకు మఱల నాలకింప వలయు నని యున్నది.

భవా:- (పఠించును)

సీ. ప్రజ్వలింప బ్రతాపవహ్ని సత్కవులార!
వ్రాయుడీ! వీరకావ్యములు మీరు
ప్రేరేచి యాంధ్రనారీమణులార! మీ
పతుల నంపుడి రణావనికి మీరు
పాడుడీ దేశీయభక్తిగీతము లాంధ్ర
వీధిగాయకులార! ప్రీతి మీరు
స్వేచ్ఛాసుఖ ముపన్యసింపుడీ జనులకు
పండితులార! తీవ్రగతి మీరు.

తే.గీ. పరుని పరిపాలనక్రియపై విరక్తి,
నాంధ్రుడే యెన్నియుగములకైన గాని
తెలుగునేలను పాలింపవలయు ననెడి
దృఢతరాసక్తి మదిని ముద్రింపు డయ్య!

చతు:- (విని) విలువగలదేనా ? భవానమ్మా ! అంతదూరమునుండి తెచ్చిన యీ చిన్న తాటాకు?

భవా:-(సాలోచనముగ లేఖ నిశ్చలయై కాంచుచు) చతురికా ! ఇది యెవ్వనిపని యై యుండునే ?

చతు:- ఏమో నమ్మా ! కందారములో నీప్రశ్నమే ప్రతిపౌరుని నోటి నుండియు విన్పించుచున్నది.

భవా:- ఆహా ! పరరాజపాలనములో బడి పరితపించుచున్న యాంధ్రమాత నుద్ధరింప నింతకాలమునకీ మహావీరుడు - ఈ స్వార్థత్యాగి, కంకణము గట్టుకొని యున్నాడు. దారుణము లగు శాసనశృంఖలములు దగుల్పబడియున్న యీ కాలమున నెంతటి సాహసకృత్యము.

చతు:- ఇందు సాహస మేమున్నదమ్మా (హేళనముగ) దీనినివ్రాసిన మహానుభావుడు నీ వనినట్లు మహావీరుడే యైనచో-బహుసాహసుడే యైనచో నీపద్యమునకు దిగువ తనపేరుకూడ వ్రాసికొనియే యుండును. ఇందు కవిత్వమే కాని శౌర్య మున్నదని తలంచుట వెఱ్ఱితనము.

భవా:- నీ విపరీతవ్యాఖ్యల కేమిలెమ్ము. ఆంధ్రజను లందఱును నస్వతంత్రులై, పురాతనౌన్నత్యము లేక యల్లాడుచున్న యీ సమయమున నింతకంటె కర్తవ్యమిం కేమియున్నదే ? పరరాజపరిపాలనమునం దేవగింపు, స్వదేశీయరాజపాలనమందలి యభిరుచి. ఇవియే కదా యే రైనను దొలుత జేయవలసిన పనులు.

చతు:- భవానమ్మా! అటులైన భీషణచక్రవర్తిగా రాంధ్రులుగా రను మాట!

భవా:- (నవ్వి) భీషణవర్మ చక్రవర్తి కాదే ! ఓఢ్రదేశమును బాలించుచున్న బల్లహుఁడే ప్రస్తుతకాలమున నాంధ్రమునకు పాలకుడు. భీషణవర్మ యాంధ్రరాజధాని యగుకందారపురినుండి యోఢ్రప్రభుపక్షమున మనల నీవిధముగ బాలించుచున్నాడు.

చతు:- ఆంధ్రదేశ మింతకుము న్నెవరిపాలనములో నుండెడిదమ్మా!

భవా :- సోమనాథభూనాధుని పాలనములో నుండెడి దట. బల్లహాలుడించుమించుగ నిరువదియైదువత్సరములకు మున్ను మన దేశముపై దండెత్తి వచ్చి మన తెనుగురాజును సంహరించి దేశమాక్రమించుకొనుటయే కాక గర్భవతి యగురాణిని - సిరియాదేవినిగూడ నంతఃపురమున నిడి యగ్ని కాహుతి గావించెనట !

చతు:- అయ్యో! అయ్యో! ఎంతపాప మమ్మా! రామ! రామా!

భవా:-ఈ రీతిగ నాంధ్రరాజకుటుంబము సర్వనాశన మైనది. భీషణవర్మ నిరంకుశపాలనమున బడి యాంధ్రవీరులు సగము చచ్చియుండవలసివచ్చినది.

చతు:- ఆఁ. భీషణవర్మ యనగ జ్ఞప్తికి వచ్చినది. ఆయన పెద్దకొడుకును నీవు చూడలేదు కాని వాడు బహువిచిత్రమైనవ్యక్తి భవానమ్మా!

భవా:- (నగుచు) నాగరాజుకాదటే వానిపేరు? వినకేమి వాని యున్మాదచేష్టలు. మన కుమారవర్మగారి కొమరితనే కాదటే వాని కిచ్చి గతవత్సరమున పెండ్లి గావించినారు.

చతు:- బంగారుబొమ్మవంటిపిల్లను పాడుముండకొడుకునకు గట్టిపెట్టినారేమమ్మా!

భవా:- చెప్పవలసిన దేమున్నది? పదవి నాసించి - ఐశ్వర్యముకాంక్షించి- ఇంతకంటె వే రేమికారణము?

(నేపథ్యమున)

పల్లవి:- సామ-గాన-లోల!-యదుబాలా! ప్రేమ నేల పోల॥ సామ॥

అ.ప. కామజనక!-తనివి సనక-నీ పద

తామరసము -లెదను- గదియ జేర్చిన ॥సామ॥

చ. మందరధర! నీ-యందె నామనసు
డెందించితి ముచికుందవరద! నా
యందు కరుణ జూప సమయ మిదె గో
విందా! ముకుందా! ఫుల్లేందీవరాయతాక్ష! ||సామ||

చతు:- (ఆలకించి) అడుగో నమ్మా! ఆయాచకుడు మంచిమంచియాంధ్ర
జాతీయగీతములు హాయిగా పాడగల డమ్మా! నిన్న సంబారపుర
ములో జూచితిని. పిలుచుకొనిర మ్మందువా? భవానమ్మా!

భవా:- ఆంధ్రజాతీయగీతములా? అలాగునటే - ఏదీ! ఏదీ! ఈ దొడ్డి
గుమ్మమున దీసుకొని రావే.

చతు:- (వడివడిగ నిష్క్రమించును.)

భవా:- (తాళపత్రమునుగాంచి) ఈ తాళపత్రఖండ మపుడే యెంతటి
విలువను సంపాదించుచున్నది! ఆంధ్రయాచకగాయకులే యాంధ్రో
ద్యమమున నందఱికంటె ముందంజ వేయుచున్నారే! ఏమో!
మా యాంధ్రమాతకు మంగళదినము లాసన్నము లగుచున్నవి
కాబోలును! యాచకులే దేశదాస్యవిముక్తినాటకమునకు నాందీపూజ
గావింప సాగినారు-ప్రచ్ఛన్నముగనున్న యాకవి- యా దేశభక్తుని
పరిశ్రమ యెంతవడిగ ఫలించుచున్నది!

ఉ. పచ్చముపాడుచేసిన, నపారమనోహరశిల్పసంపదన్;
ముచ్చిలి యున్న నాంధ్రజనభూరివిభూతివితాన; మెంత ని
ష్పచ్చర మైన "నాంధ్ర"యనువర్ణము లుండిన జాలు, సత్వరం
బుచ్చ ననూభవింపక యె యుందుమె దైవము [illegible]పినన్.

చతు:- (దారి జూపుచు) అయ్యా! ఇటు-ఇటు-మెల్లగ రండు.

భవా:- ఎవ్వరినే చతురికా! అయ్యా! యని యనుచుంటివి?

చతు:- ఈయన బ్రాహ్మణులే నమ్మా!

(పాడుచు వృద్ధభిక్షుకుడు ప్రవేశించును)

భవా:- అలాగునటే (లేచి) అయ్యా! నమస్కారము. అచట దయ
చేయుడు.

భిక్షు:- (కూర్చుండును)

చతు:- మంచిపాటలు మాయమ్మకు విన్పింపు డయ్యా! నిన్న మధుసూదనవర్మగా రింటిలో బాడితి రే! అటువంటివి.

భిక్షు:- చిత్తము తల్లీ! ఇండ్లలో నాంధ్రజాతీయగీతములు దక్కనన్యములు పాడనే పాడను. (గాన మొనరించును)

గీతము

1. "ఆంధ్రమాత వినతానన యై యెటు-లారటించెనో చాల
ఆంధ్రు లయ్యా మీ రన్యదేశవిభు-నడుగుల నొత్తెద రేల? ॥ఆం॥
2. తెనుగునేల మును ఘనవైభవమును-గొని పే రందగ లేదా
తెనుగుబాసయే దేశభాషలన్-వినుతిని గాంచెను గాదా ॥ఆం॥
3. గాజుల దాలిచి కాంతల చెంగట-గాలము పుచ్చగ నేలా
సాజ మైన మీ శౌర్యాగ్నికి రిపు-శలభము జేయ ర దేలా ॥ఆం॥
4. తెండు తెండు రిపుకాండము నెదిరిచి-చెండక చూచెద రేలా?
గండుమీరి మన చండకేతనము-దండిగ నాట ర దేలా? ॥ఆంధ్ర॥

భవా:- ఏమయ్యా! ఈ గీతమును మీ రెచట సంపాదించితిరి? మీరలే విరచించి పాడుచుంటిరా?

భిక్షు:- తల్లీ! నా కంతటిశక్తి లేదు. దీని నెవ్వరు రచించిరో నాకు మొదలే తెలియదు. ఇట్టిపాట లెన్నియో తాటియాకులపై వ్రాసి నేను నిద్రించువేదికపై నెవ్వరోరాత్రివేళ బడవైచుచున్నారు. సంగీతశాస్త్రము గొలదిగ నభ్యసించినవాడ నౌటచే నేను వీనికి దాళము సరిజేసికొని పాడుకొనుచుంటిని. మిగిలిన చదువురాని యాచకులును బాడుచునే యున్నారు. వారి కెవ్వరు నేర్పుచుండిరో యెఱుగను.

భవా:- వీనిని మీరు వీధులలో బహిరంగముగ గాన మొనరించిన రాజదండనమునకు బాత్రులగుదురేమో కదా!

భిక్షు:- వీధిలో నిట్టివి పాడను తల్లీ! ఇండ్లలో మాత్రమే-ఈ గీతములే పాడు మని యెల్లరును వేపుకొని తినుచున్నారు. నాలుగు కొంపలు దిరుగుసరికే నా జోలె నిండుచున్నది. అదియును గాక నా కే భయమును లేదమ్మా! కొమ్మలెల్ల విరిగి యెండిపోయినమ్రోడును నేను.

భవా:- అయ్యో! శివశివా! మీ కేరును దిక్కు లేనేలేరా?

భిక్షు:- ఈ పాపాత్మునిగూర్చి నీవు విచారింప నక్కరలేదు తల్లీ! ఒకమహారాజకుటుంబమునకు-నొక సద్బ్రాహ్మణ కుటుంబమునకును కీడు దలపెట్టిన దుర్మార్గుడు వీడు-ఆ పాపఫలమే నన్నీస్థితికి దెచ్చినది. దాని పరిహారమునకే నే నిపు డీ యాంధ్రప్రచారము నాచరించుట.

భవా:- అయ్యా! మీ దేయూరు?

భిక్షు:- అనుమకొండలోని యగ్రహారము.

చతు:- ఎఱుక దేవప్రభువువారు పాలించు నీ యనుమకొండయేనా?

భిక్షు:- ఔ నమ్మా! ఔను. ఇదియే. అగ్రహారమందలి మాజాతి వారందఱును నా యకృత్యము విని నన్ను వెలివైచినారు. నా యేకపుత్రుడు గతవత్సరమున నాగరాజుగారి బండిచక్రముక్రింద బడి మరణించినాడు. వానితల్లి యమితవిచారముచే నూతిలో బడి ప్రాణముల విడిచినది. అందఱియాయువు బోసుకొని నేను మాత్రము మొండినై యిట్లు తిరుగుచున్నవాడను.

భవా:- అగ్రహారికులకు మీరు గావించిన యపకార మేమి?

భిక్షు:- న న్నేమియు నడుగవలదు తల్లీ! అది యేనాడో జరిగిపోయిన విషయము. పరమరహస్యము-ప్రమాదక్షరము. క్షమింపుడు నన్నదియడుగకుడు.

భవా:- పోనిం డయ్యా! ఇం కేమైన పాడెదరా ? పద్యములుగూడ పాడగలరా ? వృద్ధులు - మీకు శ్రమ గల్గించుట పాడిగాదు గాని-

భిక్షు:- నా కాయాస మనునదియే లేదు తల్లీ!

ఉ. సారెకు నెట్టు లాంధ్రమహిసర్వమహాధనజీవవాహినుల్
పారుచు నున్నవో కటకపట్టణరాజదిశాముఖంబుగా
ఏరు నెఱుంగరా? నిలుపరేల ప్రవాహము నింక నైన; మీ
పౌరుష మెల్ల చంపుకొని పందలుగా బ్రదుకంగ నెంచిరా ?

భవా:- ఆహా! దుర్దినము లడుగంటినవి. మా త్రిలింగదేశముపై నింక యదృష్టతరణి పొడచూపు చిన్నెలు గన్పట్టుచున్నవి (ఆవేశముతో) లేదు-గోడ్రాలు కాలేదు-మా తెనుగుతల్లి! యెందఱినో వీరుల బ్రసవించినది-ప్రసవించుచున్నది. ప్రసవింపగలదు.

(నేపథ్యమున)

"ఇటుపై కార్యభార మంతయును మీయదే,"

భవా:- (ఉలికిపడి లేచి) ఎవరు వారు? చూడవే చతురికా!

చతు:- (చూచి) అయ్యగారే నమ్మా!

భవా:- కాదే! ఆ కంఠధ్వని వేఱుగా నున్నది. తిన్నగా చూడకుండ నీవు చెప్పెద వేమే?

చతు:- (మఱల చూచి) ఆఁ. ఔను. సభాపతు లగు వృద్ధమాధవశర్మగారితో గూడి యయ్యగా రిటు వచ్చుచున్నారు.

(ప్రతాపవర్మ,వృద్ధమాధవశర్మయు ప్రవేశింతురు.)
(భవానీకుమారి పో యత్నించును.)

ప్రతా:- అక్కరలే దమ్మా! వీరు మీ తాతగారే భవానీ! రా, రావమ్మా! నమస్కార మర్పించి యాశీర్వాదము గ్రహింపుము.

భవా:- (నమస్కరించును.)

వృ.మా:- వత్సే! చిరం జీవ. (భవానివంక జూచి ప్రితాపునితో) ప్రతాపమహాశయా! మీ చిరంజీవిని మొగమున చక్రవర్తినికళ యున్నది సుడీ!

ప్రతా:-(సాలోచనుఁడై) మీ యాశీర్వాదబలము. మాకుటుంబముపై మీ కట్టి యవ్యాజకరుణ.

భిక్షు:- (వృద్ధమాధవునకు నమస్కరించును.)

వృ.మా:- ఓహో! పతంజలిశాస్త్రియా?

పతం:- (శిరము వంచి) చిత్తము.

ప్రతా:- (పుత్రికతో) ఏ మమ్మా! వీరిచే బాడించుకొనుచుంటివా? గూఢచారు లెల్లెడల నున్నారు. ప్రమాదము సుమా! వీరి బహూకరించి త్వరితగతి బంపివేయుడు.

(భవానియు, చతురికయు, భిక్షుకునితో నిష్క్రమింతురు.)

వృ.మా:- ప్రతాపమహాశయా! ఆ విశాల మగుగది కార్యాలోచన సభ కనుకూలముగ నున్నది. ఆ వెనుకగది చిరంజీవి నివసించుటకు సరిపడును.

ప్రతా:- భర్తృదారకుని యజ్ఞాతవాస మిం కెంతకాలము?

వృ.మా:- సర్వసిద్ధ మైనది కాదా? నేడో-రేపో.

ప్రతా:- అడుగ మఱచితిని. మీ యనుకొండప్రయాణఫలిత మేమైనది. ఫలించినటులేనా?

వృ.మా:- (సానందుఁడై) అనుకూల్యము లభించినది. ఎఱుకదేవరాజుగారు తోడ్పడుటకు హృదయపూర్వకముగ నంగీకరించినారు. ముడికొండప్రభువు నొప్పించుభారమును దమపైననే బెట్టుకొనిరి కూడ—

ప్రతా:- మీరు సంకల్పసిద్ధులు. బ్రాహ్మణశాసనమును శిరసా వహింపనివా రెవ్వ రుందురు? ఆర్యా...

(నేపథ్యమున)
"బాబూ! బాబూ!"

చతు:- (పరుగున వచ్చి) బాబూ! పాప మా గాయకుని రాజభటులు పట్టుకొనుచున్నారు. కందారపురమున నాంధ్రజాతీయగీతముల బాడిన యపరాధమున కట! భవానమ్మ మిమ్ముల దుఃఖించుచున్నది.

వృ.మా:- (ఆలోచించి) మీ రెఱిగినరక్షకభటు లం దెవ్వరైన నున్నారేమో.

ప్రతా:- దయచేయుడు. మార్గ మేమైన నున్న విడిపించుటకు ప్రయత్నింపవచ్చును. (లేచును)

(అందఱు వడివడిగ నిష్క్రమింతురు)
(యవనిక జారును.)

# ఆంధ్రదీక్ష

## ప్రథమాంకము — ద్వితీయ రంగము

ప్రదేశము:- కందారపురవీధి.

ప్రవేశము:- నాగరాజు, సోమశేఖరశర్మ, చెన్నబసవడు.

నాగ:- (వికృతహాసముతో) హే - హే - హే. రాజమర్యాదలు నా పద్ధతులును మీ పప్పుబాపనయ్యల కేమి తెలియు నయ్యా! (చెన్నబసవనితో) ఏమిరా! చెన్నా! అంతే కాదా? మనమాటలలో నేమైన పొరబా టున్నదా?

చెన్న:- లేదు బాబూ! లేదు. అంతే-సరిగ నంతే-అచ్చముగ నంతే. తలితోడు బాబూ!

సోమ:- నేనుమాత్రము బాబుగారి మాటలకు మారు చెప్పితినా? అవి కేవలము వేదవాక్కులు.

నాగ:- (చూపుచు) చెన్నా! చెన్నా! అదెగో చూడరా! వా డెవడో పండ్లకావడి గాబోలును పట్టుకొని ప్రక్కసందులోనికి తప్పుకొని పోవుచున్నాడు. మహారాజు లంతటివార మిక్కడ మసలుచుండగ మా కొక్కపండైన మచ్చున కీయకుండగ మాయముండకొడు కేలాగున నక్కుచు పోవుచున్నాడో చూచితివా? ఆంధ్రప్రతినిధి గారి గారాపుకొడుకును గదా! వాని కేమా పొగరుబోతుతనము? పరుగెత్త వేమి? నాలుగు తన్నులు తన్ని చేతి కంకినన్ని పండ్లు లాగుకొని రారా! పోవేమి?

చెన్న:- (నిష్క్రమించుచున్నాడు)

నాగ:- చట్టవిరిగిన యడవిపందివలె నట్లు కాలీడ్చుకొనుచు పోయెద వేమిరా?

సోమ:- ఏవియో-కాయయో-కసరో యమ్ముకొని బ్రదుకు నమాయి కపు బీనుగునకు దివాణపు మర్యాదలు తెలియునా? బాబూ!

నాగ:- తెలియనపుడు మా దర్శనము చేసికొని-మా సన్నిధి నేడ్చి తెలిసికొనవలెను.

సోమ:- చిత్తము బాబూ! ఏదో-దరిద్రుడు...

నాగ:- ఊఁహూ. దరిద్రుడు మారాజ్యములో నెందులకు జేరవలెను? అటువంటివాళ్లను దేవుడెందులకు పుట్టింపవలెను?

సోమ:- బుద్ధిలేక బాబూ! చిత్తము-చిత్తము. ఒక్కొకచే బోధపడు చున్నది.

చెన్న:- (ప్రవేశించి) బాబూ! వాని మొండితనము మండ! పండ్లాడ లాగునపుడు మట్టగిడసవలె యెంత కొట్టుకొనినాడు వాడు. భల్లూ కపుపట్టు బట్టినాడు మహాప్రభూ!

నాగ:- ఆఁ. మనయాజ్ఞ సుగ్రీవాజ్ఞ-ఏమందువు శర్మా!

సోమ:- సందేహ మేమి బాబూ! అంతటివారే తమరు.

నాగ:- (పండ్లు గైకొని) చెన్నా! ఆగాడిదకు మనశక్తి యంతయు మనవిచేసితివా?

సోమ:- (చేతులు నలుపుకొనుచు) ప్రభువులు పరాకు చిత్తగించినారు- "సెలవిచ్చితివా" యని యనుటకు మారుగ "మనవి చేసితివా" యని యనుచున్నారు.

నాగ:- (విసుగుతో) మహారాజులు మనసువచ్చినట్లు మాటలాడుదురు- నీ చచ్చు దిద్దుబాటేమి? నీవు చెప్పువాడవు-మేము చేయువారల మునా? మా యిష్టము-అదియు గాక మా పూర్వు లన్నమాట కెన్నడును దిరుగు లేదు. మేమును దిరుగువారము కాము. ఊరు మీద యూరు పడినను తిరుగము.

సోమ:- చిత్తము. ఏలినవారి ప్రభావము మాకెట్లు బోధపడును బాబూ! ప్రభువుల కింతపట్టుదల యుండునని గ్రహింపనైతిని. క్షమింపవలయును.

నాగ:- (పండు కొరికి) చీ-చీ-ఇది యేమిటిరా? చెన్నా! దిక్కుమాలిన పండ్లు. నీ తెలివి కాలిపోను. పచ్చివి తెచ్చితివి. ప్రభువువారి ఫలాహారపద్ధతి పరాకుపడినా వటరా?

చెన్న:-(నోరు చేతితో మూసుకొని) బాబూ! బాబుగారు పాచి మొగముతో...

నాగ:- ఆఁ ఆ. ఛూ. ఛూ. ఛూ. పాడుతొత్తుకొడుకా! పదిమందిలో నేలినవారిపరువు తీసివైచితివిరా! "బాబూ! దయచేసి దంతధావ నము చిత్తగింపు" డని యనిన చిత్తగింప మటరా! బానిసముండ కొడుకా! నీ కెంతపొగరురా! ఏమయ్యా! శర్మా! డీముపిట్టవలె నట్లు చూచెద వేమి? ఇందు మన పొరబాటున్నదా?

సోమ - గడ్డిపరకం తైన నేలినవారి తప్పు లేదు బాబూ ! పండ్లు తినుటకు పక్షులు మొగము గడుగుకొనుచున్నవా ? పచ్చగడ్డి మేయబోవు పసరము పండ్లు తోముకొనుచున్నదా? దేవరవారి యిచ్ఛ ఎవ్వరు నో రె త్తగలరు ?

నాగ:- అద్దిరే! అదయ్యా! సారమైనమాట. ఎంత చెడినను బ్రాహ్మణుడవు. మా దివాణపుమరియాద లపుడే యెన్నిపట్టుబడిన వయ్యా! సరియే చూడు. శర్మా ! మే మిపు డెక్కడకు దయచేయదలచితిమో జ్ఞప్తికి తెమ్ము- ఆఁ ఆగు. మంచిశకునము చూడు.

సోమ:- పిడుగునకు వారశూలభయమా ? బాబూ!

నాగ:- అదీ- మాట. బొడ్డువారువంటిముక్క చెప్పితివయ్యా ! మాకు నచ్చినది. చెన్నా! పెద్దతెరడింకీపుంజు నొకదానిని శర్మకు బరాతమిప్పించినారు దివాణము. విన్నావా ?

చెన్న:- బాబూ! బాపలకేనాండి కోడిపుంజు ?

నాగ:- ఓరి! శకునపక్షిముండకొడుకా! అధికారుల దృష్టిలో హంసయు కోడియు నొక్కడేనురా! ఏమి శర్మా !

సోమ:- చిత్తము బాబూ ! అధికారుల యాజ్ఞ వాతరోగమువలె తిరుగు లేనిది. కోడి- హంస యని పేరులభేదమే కాని వస్తుభేదము లేనే లేదు. అదియు పక్షియే, ఇదియు పక్షియే. దానికిని రెండు ఱెక్కలే. దీనికిని రెండే. కోడికూత యూరెల్ల మేలుకొలుపును- హంస కునికిపాటులు బడుచుండును.

నాగ:- భేష్. భేష్. చూచితివిరా చెన్నా! మనశర్మ యేలాగుననైన గడ్డుముండకొడుకు రా! మా సంస్థానమునకు దగినవాడు. శర్మా, గువ్వకఱకుట్లవలె నీముక్క లెంత రుచికరముగ నున్నవయ్యా, నల్ల తిరుగబోసినటు లేమిథారయ్యా ! నీది. చూడు. కవులలో మొదటివా డెవ్వడు ?

సోమ:- వాల్మీకి బాబూ !

నాగ:- వాడు కవికూర్చిన దొకటి చదువుము. హాయిగా చదువుము. కారునకు వచ్చినకాకిడేగకంఠమువలె నుండవలయును సుమీ, వింటివా ?

సోమ:- ఇదిగో పాడుచుంటిని బాబూ !

శ్లో. నాహం జానామి కేయూరే, నాహం జానామి కుండలే.

నాగ:- ఆఁ. ఆఁ. అంతటితో నాగుము. వేటజాగిలమువలె నట్లు తరుముకొని పోదు వెందులకు? అర్థము చెప్పవోయీ ! ఎంతవఱకు పాడితివో యంతవరకే. చచ్చినకోడియీఁకలు దూసినట్టు దానియర్థము విడదీసి చెప్పుము.

చెన్న:- కానీ శేఖరముబాబూ! ఆలస్యమైన నయ్యగారి కాగ్రహాము.

సోమ:- సీతాదేవి విమానమునుండి జాఱవిడిచిన వస్తువులు చూపి వీనిని నీ వెఱుగుదువా? యని శ్రీరామచంద్రమూర్తివా రడుగగా లక్ష్మణుడు చెప్పనుత్తర మిది బాబూ !

నాగ:-ఏ మనినాడు ?

సోమ:- "ఈ యంగదముల నే నెఱుగను. ఈ కమ్మలు నే నెఱుఁగ" నని.

నాగ:- దొంగముండకొడుకు. వీనిని నమ్మవలసినపని లేదు. వీడే తీసియుండును. తన్ని మా వంటిప్రభువుల కప్పగింపవలసినదే. ఆఁ. తరువాత ?

సోమ:- దొంగతనము కాదు బాబూ !

నాగ:- కా దని వాదింపకు. మా కంతయు నవగాహనమైనది. చదువు.

సోమ:- (చదువును.)

"నూపురే త్వభిజానామి, నిత్యం పాదాభివందనాత్" అనగా నందెలుమాత్ర మెఱుఁగుదును. నిత్యమును ... ... ...

నాగ:— ఆఁ. ఆగు— ఆగు. మామాట బుజు వైనదా? అందెలు తీసినట్టు లొప్పుకొనినాడా? అన్నియు వీడే దొంగిలింపలే దని యనగలవా? సరియే. చిట్టచివర కే మనినాడు ?

సోమ:— ఎల్లవేళల వదినెగారి పాదములకు నమస్కరించు చుండుటచేత నందెలుమాత్రము చూచితి" నని.

నాగ:— తెలిసినది. ఇందులకా? యీ దొంగదండములు! వీని నేలచూపులు మండిపోను! నేలచూపులవానిని, కాటుకకన్నులవానిని దరికి రానీయరా దని మాదాసి శ్రీరంగి చెప్పనే చెప్పినది మాయమ్మగారితో. విన్నావురా? చెన్నా !

చెన్న:— వినుచుంటిని బాబూ! ఏలినవా రెఱుగని దేమున్నది?

నాగ:— శర్మా! వాల్మీకి యెవ్వడు ?

సోమ:— చిత్తము. మా జాతివాడే నండి. బ్రాహ్మణుడే!

నాగ:— అందుచేతనే యీ లాగున నేడ్చినది కవనము. మా చెన్నబసవడికవనము కాసంత విను శర్మా! చెన్నా! ఏదైన పాడు !

చెన్న:— (పాడును.)

"రావణాసులోరు రంబమ్మకొ ప్పట్టి
యీడ్సికెల్లి, పక్క నేసినారు" ఊ— ఊ— ఊ—

నాగ:— అద్దీ! అద్దీ! పౌరుషమంటే యదీ, సరస మనగా నదీ, చూచినావా? శర్మా! బసవడి కవనానకు బాపన కవనానకు గలభేదము. కోడిపులావున కున్న పసందు కొయ్యతోటకూర కేది ? పిట్టచిపుకుల లోని విశేషము బీరకాయ కేది? సొజ్జపిట్టులోనిసొంపు చప్పిడి పెసరపప్పునకు సప్తజన్మాలకైనను వచ్చునా? కోడిమెడలు వైచుకొని, కొక్కిరబోడు చుకొని గ్రుడ్లగూబవలె నట్లు చూచెద వేమి? అయినదా? అధికారులశక్తి బోధపడినదా ? ఆదికవి— యాదికవి యని యుంటివే ?

సోమ:— చిత్తము బాబూ! ఏదో! ప్రథమప్రయత్న మగుటచే చాల

వగ ముందున కేగినదిగాదు వానిధార- ఇప్పటివారివి మెఱుగు-
పెట్టిన మేలిమిబిళ్లలు. వీని పనివానితనమే వేఱు.

నాగ:-ఏమిరోయి! చెన్నా! ఏలాగున నైనను తెలివితేటలు గలనిర్భా-
గ్యుడేరా శర్మ-

చెన్న:- అంతే బాబూ- అంతే-

సోమ:-(తనలో) ఓయి భగవంతుడా! పులికడుపున చెవులపిల్లి పుట్టి-
నదే- భీషణవర్మపుత్రుడ? వీడు- ఔను. ఇది సహజమే. ఈ వెంగలి
వలన భీషణుని రాజకీయరహస్యములు సంగ్రహించి తమకు దెలుప
వలసినదిగా మా సభాపతి మాధవశర్మగారి యాజ్ఞ. నేనీపనికై
వీనివెంట నంటితిట్లు దినుచు, నేను తినుటయే కాక యాదికవీం-
ద్రునిగూడ తిట్టించుచు వినవలసినకర్మము తటస్థించినది. అజ్ఞులగు
నధికారుల నాశ్రయించుట కష్టతమకార్యమే. వారి యవకతవక
మాటలకు తల నూపుచు నుతింపవలెను. నవ్వరాకున్నను నవ్వ-
వలయును. వారి మతిమాలినమాటలకు మహాభాష్యము వ్రాయ-
వలయును.

నాగ:- శర్మా! ఏదియో గట్టిగ యోచించుచున్నాడవే-

సోమ:- బాబూ! ఏమున్నది? ఏలినవారి తెలివితేటలగురించి- సరసత-
గూర్చి- పాండిత్యమునుగూర్చి.

నాగ:- విన్నావటరా? చెన్నా! శర్మ చెప్పిన మనమహిమ.

చెన్న:- (వినయముతో) బాబుగారి ఫలాహారమునకు- పట్టికిని-
ప్రొద్దెక్కినది-

నాగ:- ఔనురా! పద- పద- ముందు నడువుము. దారి చూపింపరా!
ఏమి శర్మా! నీవుకూడ కోటలోనికి వచ్చెదవా?

సోమ:- తమరు దయచేయుడు. రెండుగడియలలో మీ దర్శనము-
చేసికొందును.

(అందఱు నిష్క్రమింతురు)

(తెర పడును)



# ఆంధ్రదీక్ష

## ద్వితీయాంకము — ప్రథమ రంగము

(ప్రదేశము:—అనుమకొండలోని యగ్రహారమున వృద్ధమాధవశర్మ సౌధము).

(ప్రవేశము:—చిన మాధవశర్మ (పత్రము చూచి పఠించుచు)

చి. మా:—

సీ. ఆంధ్రయశోవల్లి యరిబల్లహస్తపాల
పశుజగ్ధమై మోడువారలేదు
ఆంధ్రీయయువనాడి కాంతరశోష్ణర
క్తావేగ మింక జల్లారలేదు
ఆంధ్రదేశీయభాషాస్వాదనంబున
నభిరుచి యింక నడుగంటలేదు
ఆంధ్రరాజస్థాపితాన్నసత్రగృహాళి
యాచమట్టగ నేల నొరగలేదు

తే గీ. సదవకాశంబు పూర్తిగా జాఱలేదు
నడుములు బిగించి, వైరుల గెడపి, యాంధ్ర
జయపతాక బ్రతిష్ఠింప సాగిరండు
మానధనులార! యాంధ్రకుమారులార!

వృద్ధమాధవశర్మ:-(ప్రవేశించి) ఏమది? నాయనా! అంత తీవ్రముగ జదువుకొనుచున్నాడవు?

చి. మా:-(నవ్వి) ఇదియా! తాతగారూ! ఏదియో వచ్చియురాని కవిత—

వృ మా:— పద్యములా? ఏవి! ఏవి! పఠింపుము. ఈ ముదుసలి చెవులతో నాలకింపనిమ్ము. విషయ మేమి?

చి. మా:- విషయము వేఱుగ నేమున్నది? ఆంధ్రప్రబోధమే. మీ రా జ్ఞాపించిన విషయమే. కాని తాతగారూ! బ్రాహ్మణత్వ మడ్డు వచ్చినదిగాని లేనిచో నీసరికి గంటము వీడి కత్తిని బట్టకుందునా?

వృ. మా:- ఖండనమునకు బ్రాహ్మణ్య మాతంక మగునని యే సిద్ధాంతీకరించుచుంటివా?

చి. మా:- (ఆలోచించి) ఔ నౌను. అనాలోచితముగ నంటిని. నేను మున్నొకప్పుడు వ్రాసినవ్రాత లిపుడు విస్మరించితిని. పొరబడితిని.

వృ. మా:- ఏమని యేరికి వ్రాసితి వోయి! నేనుగూడ విని సంతసింపగూడదా?

చి. మా:- మీరు మెచ్చుకొనదగినంతవిశేష మేమియును లేదు తాతగారూ! మొన్ననే నరేంద్రపురాగ్రహారవాసుల కాంధ్రోద్యమవిషయమున సాహాయ్యమొనరింపుడని కోరుచు నొక విజ్ఞప్తిపత్ర మంపితిని. దానిపై వా "రాంధ్రక్షత్రియవీరులే మిన్నకుండిన పుడు మన కేల? బ్రాహ్మణజాతి యేమిచేయగలదు? ఆ హనన కర్మ మగ్రజాతికి దూర"మని వ్రాసి నాకు ప్రత్యుత్తరించినారు.

వృ. మా:-ఊఁహూ. వారికి నీ వేమని మఱల వ్రాసితివి.

చి. మా:-ఏమని లిఖింతును? నాకు మీ రిపుడు స్మృతికిదెచ్చినదానినే వ్రాసితిని.

వృ. మా:- అనగ?

చి. మా:- ఇం కేమున్నది? విప్రులు చేయదగుపని వీరుల బ్రోత్సహించుటయే యనియు, క్షత్రియవీరు లీ త్రిలింగదేశమున నొక్కరును లేనిచో నాపని నగ్రజాతియే యాచరింపనగుననియు పద్యరూపమున వ్రాసితిని.

వృ. మా:- ఏమని? ఆ పద్యము జ్ఞప్తియం దున్నదా? తాతా!

చి. మా:- ఉన్న దండీ! చదువ నాజ్ఞయా?

వృ. మా:-ఊఁ (శిరము నూపును.)

చి. మా:-(పఠించును.)

మ. విలు చేపట్టినవారికెల్ల ,గురు డౌపీరుండు ద్రోణుండు, నా
బలశాలిన్ సరిపోలుపుత్రమణి యశ్వత్థామయున్, వాని మా
తులు డై నట్టికృపుండు బ్రాహ్మణులు గాదో! చెండరో వారు శ
త్రుల, నా భార్గవరాముఁడున్ ద్విజుడుగాదో! రాజులం ద్రుంపడో!

వృ. మా:-(ఆనందముగ) చక్కఁగ సమాధానించితి వోయి! నాయనా!
ఏవి తాతా! క్రొత్తగ నీవు రచించినపద్యము లొకటి రెండు విని
పింపుము. పద్యము లద్భుతములుగ నున్న వని ప్రతీతి.

చి. మా:-(సవినయముగ) మీవంటి మహావిద్వాంసుల సన్నిధిని జదువ
దగినంతపాటవ మీ పద్యములలో లేదేమో యని నాకు భయము
తాతగారూ !

వృ. మా:-పటుత్వము లేకేమి ? మనుమనిమనసులో- మాటలలో
శరీరములో- సాహిత్యములో నున్నపటిమ కవితలోమాత్ర మేల
లేకపోవును ? చదువు మోయీ !

చి. మా:-(పఠించును.)

మ. పరదేశీయనృపాలు డాంధ్రధరణిం బాలింపగా నొక్కఁము
మ్కఁరు గందారపురంబున న్నిలిపె; నీశౌర్యాగ్ని చల్లారెనా?
కరముల్ మోడ్చి "హాసా"దటంచు మిడుకంగా నేలరా ?
చచ్చినం
గఱవాభూమికి? నుట్టిగట్టుకొని యూగంజూతువా? ఆంధ్రుడా!

వృ. మా:-ఆగుము తాతా! ఆగుము. నీయీ ప్రౌఢకవితను మీయమ్మ
కూడ విని యానందింపగలదు (బిగ్గరగా) అమ్మాయీ! ఒకసారి
యిటు రా! మనచిరంజీవి యెంతటివా డైనాడో చూచితివా ?

సిరియాలదేవి:-(ప్రవేశించి) నాన్నగారూ! పిలిచితిరా ? ఏమి ?

చి. మా:-(నగుచు) ఏమియును లేదమ్మా! నా తప్పుకై తల విని తాత
గారు పరిహాస మాడుచున్నారు.

వృ. మా:-అమ్మాయీ! అపహాస్యమో- అభినందనమో నీవే నిర్ణయింపగలవు. ఆలకింపుము. తాతా! చదువుము.

చి. మా:-(పఠించును.)

మ. అనుమానించుచు గాలయాపనము సేయంబోల దాంధ్రావనీ
జననీపాదము లంటి బాసగొని దీక్షం బూని స్వాతంత్ర్యముం
గనుటో-శాశ్వతదాస్యముంబడయుటో-కావింపుమోయాంధ్రుడా!
తెనుగుందల్లికి పుట్టుకున్నయెడ నీ దేశంబునే వీడుమా!

వృ. మా!-ఏమమ్మా! ఎటు లున్నది. నా మాటలో నసత్యమున్నదా! ఈ పద్యము వినిన నే యాంధ్రునియొడలు జల్లు మనకుండును? మఱియొకటి పఠింపుము నాయనా!

చి. మా:-(పఠించును.)

శా. మీరే యీగతి కన్నులార పరభూమీపాలదాస్యంబుచే
నారాటించు తెనుంగుతల్లిఁ గనుచున్ ప్రాణాలతో నున్నచో
వేఱే యున్నదె మార్గ;మాంధ్రమహీ నిర్వీర్యమ్ముగా మాఱెనా?
వీరాగ్రేసరులార! పందతన మావేశించెనా? నేటికిన్ ?

వృ. మా:-ఆహా! ఆంధ్రవీరుల నావేశపూరితుల గావించుట కీయొక్క-పద్దియమే చాలునోయి తాతా!

చి. మా:-ప్రస్తుతరాజోద్యోగులగూర్చి రచించినపద్యము పఠింపుమందురా? తాతగారూ!

వృ. మా:-ఎన్ని చదివినను వినుటకు సంసిద్ధులమే నోయి. మా కింత కంటె వలయు నదేమి?

చి. మా:-(పఠించును.)

మ. నిలువ న్నీడయు నుండకుండును సుడీ! నిర్వీర్యులై యోధ్రసే
వల గావించుచు నున్న! చాలు!పదవీవ్యామోహమింకేల?మీ
సలపై దేనియతీపి జూపుచును మోసంబుం బచారించు రా
జుల శుష్కప్రియ శూన్యహస్తములపై జూపెంతకాలం బికన్.

సిరి:-శరీరమున నాంధ్రరక్తబిందు వొం డున్నను నీ యొక్క-పద్యము చెవుల బడినంతనే బల్లహోద్యోగులు తమ పదవులకు మంగళము పాడి ప్రతిఘటింపకుందురా ?

వృ. మా:-ఇక మనప్రజకు బోధింపవలసిన దేదియును లేదు. సర్వము సూచించితివి తాతా! (వీపుపై దట్టును.)

చి. మా:-మీరు చెప్పవలసినదిమాత్ర మున్నది కాదా తాతగారూ!

వృ. మా:-(సాలోచనుఁడై) నే నేమి చెప్పవలయును? నీ వేమి యడిగి నాడవు ?

చి. మా:-(గోడ నున్న చిత్రఫలకము జూపి) ఎన్నిమారులు వేడినను న న్నాచిత్రఫలకము జూడ ననుమతించితిరా? దానిపై గప్పఁబడిన యా నీలాంబరము రవంత తొలగనిచ్చితిరా? మఱి-

వృ. మా:-నాపై నీ నిష్ఠుర మెందులకు ? పోయి చూడుము తాతా! ఇంకేదియో చెప్పబోయి యాగితివే !

చి. మా:-అడుగు మందురా? తప్పక శంకానివృత్తి గావించెదరా !

వృ. మా:-ఓ- అభ్యంతర మేమి ?

చి. మా:-తీర్థయాత్రల సేవింప నేగిన నాజనకులు వారణాసిలో విషూచివ్యాధిచే విశ్వేశ్వరునిలో నైక్యమందిరని నుడివితిరి. నేను మీ మనుమడనే కదా ! ఎంతకాలమునుండియో గనుచుంటిని. ఒకపరియైనను మీ సహపంక్తిభోజనభాగ్యమును నాకు గటాక్షించితిరా? ఏమి? మా యమ్మను, నన్నును కులమునుండి బహిష్కరించితిరా? మే మొనరించిన యపచార మేమి ?

సిరి:-నాయనా ! ఆ విషయము సమయము వచ్చినపు డెఱిగించెదమని నేనును మీ తాతగారును నీకు జెప్పితిమి గాదా ?

చి. మా:-సమయ మి కెంతకాలమున కమ్మా ! ఇరువదేనువర్షముల ప్రాయ మరుదెంచినది గదా! షష్టిపూర్తి కావలయునా? సహస్ర మాసజీవి నైన వెనుకనా? మీ రెఱిగించుట ?

వృ. మా:-లెమ్ము. వత్సా! లెమ్ము. సర్వ మెఱింగించెదను గాని తొలుత నా చిత్రఫలకము దరిసింపుము. (లేచి కప్పినవస్త్రము తొలగించి) మాధవా! ఇటు చూడుము. ఈ యాకృతి యేరిదో నీవు చెప్పగలవా ?

చి. మా:-(పరిశీలించి) వీరిని నే నెన్నడును దర్శించి యుండలేదు నిక్కువమే. కాని యాకారము ననుసరించి యీ మహాశయు నొకసార్వభౌమునిగ నూహింపవచ్చును.

సిరి:-(కన్నీటితో గద్గదకంఠమున) ఔను నాయనా! ఔను.

చి. మా:-(తలనెత్తి తల్లిని జూచి) ఇదే మమ్మా! ఇటులు విచారించుచుంటివి ? ఈ పురుషునకును మనకును నేమి సంబంధము ?

వృ. మా:-లే కేమి ? తాతా! ఉన్నది. ఈయన మన యాంధ్రదేశమవిచ్ఛిన్నముగ బరిపాలించిన ప్రభుసత్తముడు. మనము పరిపాలితులము. ఉత్తము డగుమహారాజుపై ప్రజల కీమాత్ర మభిమాన ముండకుండునా ?

చి. మా:-ఎన్నడో గతించిన యీ మహీశుని గని మాధవార్యుల పుత్రిక కంట నీరు పెట్టుకొనుచున్నదా? తాతగారూ? ఈయమ్మాయి కపు మనుమని నెంత యాడించుచున్నారు ? మీరు గావించిన హేతుకల్పన మింత బిగువులేనిదిగ నున్న దేమండీ !

వృ. మా:- తాతా! నా మాట పూర్తిగ నాలకింపకయే వ్యాఖ్యల కారంభమా ? మీ యమ్మ దుఃఖించుట యీ నృపాలుని గూర్చి కాదు, ఈయన రాణిగారి దుర్మరణమునుగూర్చి. తెలిసినదా ? స్త్రీస్వభావము ?

చి. మా:-ఈ ప్రభుని నామధేయ మేమి ?

వృ. మా:-సోమదేవభూపాలుఁడు.

చి. మా:—(స్మృతి నభినయించి) ఆఁ. తెలిసినది. ఏ మమ్మా ఈ ప్రభు వృత్తాంతము ము న్నొకపరి నాకు జెప్పితివి కాదా ? ఈయన సతీ మణినే కాదటమ్మా! బల్లహరాజాధము డంతఃపురమున నుంచి దహించెనట.

సిరి:—ఎంతకాలమునాటి మాట నీకు జ్ఞప్తియుం దు న్నదో యి ! నా తండ్రీ!

వృ. మా:—ఔను గాని తాతా! ని న్నొకటి యడుగదలచి మఱపు నందుచుంటి నోయీ! నీ వింతతీవ్రగతి నాంధ్రప్రజల కావేశము గల్పించుచుంటివే. నీ నాయకత్వమున నీ విప్లవ మభివృద్ధి నంద—ప్రజలు, వీరరాజకుమారులు, చెలరేగి యోధరాజున కుద్వాపనము జెప్పెద రనుకొనుము. ఆంధ్రదేశ ముద్ధరింపబడిన దను కొనుము. అపు డీ రాజ్యము నేరికి ధారవోయ నెంచితివి? ఆ రాజ కుటుంబ మేది ? లేక నీవే పాలింప నెంచితివా ?

చి. మా:—నా కట్టిదురాశ లేదు. పరనరపాలుని బాఱదోలుటయే నా యాశయము. ఆంధ్రమాతను చెఱనుండి విడిపించుటయే నా కర్తవ్యము. ఆంధ్రరాజ్యము పునస్థాపిత మైనపిదప సోమదేవ నృపాలుని యే దూరపుబంధుగునికై నను పట్టము గట్టితీరెదను.

వృ. మా:—దూరపుబందుగున కెందులకు? ఆ రాజశేఖరుని తనయుడు పాలింపవలయును గాని.

చి. మా:—ఏడీ? రాజనందనుఁ డేడీ? సిరియాలదేవీమహారాజ్ఞి ప్రస వింపకమున్నే యగ్ని కాహుతి యయ్యెనుగదా!

వృ. మా:—చూడుము తాతా! పట్టమహిషి మరణింపలే దనియు, నామె యొక పురుషశిశువును బ్రసవించిన దనియు, నిచటనే, యీ యాంధ్రదేశముననే యజ్ఞాతవాసము గావించుచున్న దనియు నొక కింవదంతి యున్నది సుమా !

చి. మా:-ఆ గాలిమాట లంతగ నమ్మదగినవి కావు తాతగారూ! ఏమన తా నధిష్ఠింపవలసిన భద్రసింహాసనముపై పరరాజహతకుడు ప్రకాశించుట గని సుక్షత్రియవీరు డింతకాలము సహింపగలడా?

వృ. మా:-నీ వనునది సత్యమే. సహింపజాలడు. సహించుట లేదనియు వింటిని. ప్రస్తుతకాలమున ప్రజానీకమును ప్రేరేపించుచున్నవా డెవ డని నీయభిప్రాయము. ఆత డూరకొనలేదు. ప్రచ్ఛన్నముగ నుండియే ప్రజలలో నాంధ్రాభిమానమును రేకెత్తించుచున్నాడు. వీరుల బ్రోవుసేసి సమాలోచనముల జరుపుచునే యున్నాడు. కాలమునకై గనిపెట్టుకొని యున్నాడు. ఇది నేను తెలిసికొనినసంగతి.

చి. మా:-(తనలో) ఇప్పటికి పరిస్థితి యంతయు నవగతమైనది. సార్వభౌముని చిత్రఫలకము విప్రగృహమున నుండుట, దాని గాంచి మాయమ్మ చింతిలుట, నేను చూడరా దనుట, తాతగారికి మే మపాంక్తేయులమై భుజించుట, తెలిసినది. సందియము లేదు. నా యనుమానము సత్యమే. నాకు క్షత్రియోచితవిద్యల సరహస్యముగ బోధించుహేతువు నేటికి బోధపడినది. ఈ మహాత్ము డిన్నినాళ్లకు నా కనులగంతల దొలగించినాడు. నే నాంధ్రప్రచారము గావింప బ్రోత్సహించుట కిదియే కారణము గాబోలును.

వృ. మా:-తాతా! ఏదియో దీర్ఘాలోచనలో మున్గియుంటివే!

చి. మా:-ఏమియును లేదు తాతగారూ! ఆంధ్రుల మేల్కొలుపు నాతడు నేనుకాక యితరు డున్నవాడా యని-

వృ. మా:-అబ్బా! ఎంత యహంభావ మోయి! నీ వొక్కరుడవే యీ తెనుగునేలకెల్ల ధీశాలి నని, దేశభక్తుడ నని, వీరుడ ననియు గర్వించుచుంటివా? దేశము గొడ్డుపో లేదు. అభిమాను లెందఱో యున్నారు. సోమదేవసుతుడే స్వయముగ స్వరాజ్యసంపాదనకై సర్వగతుల పాటుబడుచున్నాడు.

## నాగబంధః

నాగబంధ ముదాహరతి శ్రీమంత మితి. లక్షణం తు రేఖాభ్యాం చతురశ్రాణి చతుష్కోష్ఠాని కల్పయేత్ రేఖాద్వయాంతరాలే స్యా ద్యథా కోష్ఠే గృహాష్టకం విదిక్షుకుండలీ కుర్యా త్తద్రేఖాగ్రై ర్యథాక్రమం దిగ్భాగాణి బాహ్యాని యోజయే ద్దిక్త్రయే మిథః. ఏకత్ర తు ఫణా పుచ్ఛమేళనం కల్పయే త్తథా అంతరా ణ్యక్షయా కుర్యా త్సందంశా స్స్యు ర్యథా మిథః. వర్ణా వృత్తిస్థలా న్యత్ర కోష్ఠ కోణాని షోడశ సందంశానాం చతుష్కం చ కంఠ శ్చే త్యేకవింశతిః. ఆవృత్తి ర్యుగ్మవర్ణానాం నేత రేషా మిహ క్వచిత్ అర్కేశా నదశ బ్రహ్మవర్ణాః పాదచతుష్కగాః ఆవర్తేరన్ నైరుతాదికుండలే స్వాప్ర దక్షిణం యథైవం స్యా త్తథా వర్ణాన్ ఫణాతో విన్యసే త్క్రమాత్ త్రింశ దష్టావింశతి శ్చ షడ్వింశతి రనుక్రమాత్ వేష్టనత్రితయే వర్ణా స్సమాప్తి స్తు గళాంతరే సర్వ మేత న్నిధా యాంత స్సంగృహీతం మహాత్మభిః విదిక్స్థలే కుండలితం స్వ మంగం స్వేన త్రిరావేష్ట్య విభంగిభంగం క్షిప్త్వా గళే పుచ్ఛమహే స్థితస్య పార్శ్వః ఫణాతః ఫణి బంధ ఏష ఇతి. శ్రీమంతం విశ్వరక్షాపటిభుజమహిమశ్రీ సమేత ప్రతాపం దర్పాంధక్ష్మానరాహిస్వవిభుం నిభుజం ముష్టపస్య ఉరు భాసశ్రీ శతాశ్రితాగ్ర్యమౌళిం ధనదసదయసఖ్యం హి సంరక్షదుగ్ధం భుశ్రీరుచ్యం తం ఈశ శ్రితనతపదయం మానివర్గే సకామం పదచ్ఛేదః. ఉరు ర్మహా న్భాసో రుచి ర్యస్య సః. యద్వా ఉరు ర్బలవాన్ భాసో వాహనరూపో గరుడో యస్య స ఇతి వా భాసో భాసి ఖగే గోష్ఠ ఇతి భాస్కరః. ఈశో నియంతా యద్వా యాం ఫణిని శేష ఇతి యావత్, శేత ఇతీశ ఇతి వా "ఈకారోబ్జదళే లక్ష్మ్యాం వాణ్యాం కమలకేసరే రసనాయాం శక్రచాపే బాణే ఫణిని కందర ఇతి రత్నమాలాయాం. శ్రీశః లక్ష్మీపతిః యద్వా శ్రియో రామాదివేషా అస్య

సంతీతి వాలోమాదిత్వా చ్ఛప్రత్యయః. శ్రీ ర్మాయూమాపా లక్ష్మీ శ్శైతే స్మిన్నితి శ్రీశ ఇతి వా ప్రకృతే రస్య కారణత్వా దితి భావః మానివర్గే శేతే ధ్యేయత్వేన తిష్ఠతీతి తథోక్తః.యద్వా మునీనాంబుద్ధానాం వర్గస్య ఈశ ఇతి వా మునిర్బుద్ధమమర్షి ష్వితి రత్నమాలాయాం. తేషాం సంబుద్ధిః శ్రీమంతం లక్ష్మీవంతం విశ్వరక్షాయాం పటుసమర్థో భుజమహిమా భుజబలం తస్య శ్రియా సమేతః ప్రతాపో యస్య తం యద్వా విశ్వరక్షాపటుభుజం అహిమశ్రీ సమేతప్రతాప మితి పదద్వయం. విశ్వరక్షాయాం జగత్పాలనే పటూభుజా యస్య తం హిమశ్రీ సమేత శ్చంద్రః. తద్భిన్నో హిమశ్రీసమేత స్సూర్య స్తస్య ప్రతాప ఇవ ప్రతాపో యస్య తం యద్వా అహిమయా అశీతలయా ఉష్ణయేతి యావత్. శ్రియా తేజసా సమేతో ఽగ్నిః తత్సదృశః ప్రతాపో యస్య త మితి వా దర్పేణ మదే నాంధాః క్ష్మావరా రాజాన స్త ఏవ అహయ స్సర్పా స్తేషాం స్వస్య కులస్య విభుం ఖగేశ్వరం స్యా నహిర్వృత్రసర్పయోః "వి శ్వచక్షుషి వ్యోమ్ని వాతే పరమాత్మని పక్షి ష్వితి రత్నమాలా, దుష్టా దురాత్మానః త ఏవ పాః పర్వ తాః తేషాం జాతా వేకవచనం. "పః పుమాన్ పవనైశైనే ప్రకాశే కాస్తుభే క్షణ ఇతి రత్నమాలాయాం. ఇభుజ మింద్రం "ఇకారో రత్నవృత్రయో రి త్యజయ్యః. త్రాతాః పోషితా ఆర్యమాళయో వరిష్టాయేనతం యద్వా త్రాతా ఆర్యాయై స్తేషాం మాళిం సాధుజనావన శిఖామణిమిత్యర్థః. ధనదే సదయం సఖ్యం యస్య తం అహ మివ కుబేరోఽపి ధనం దదా తీతి. తస్మిం త్సదయమైత్రీక మిత్యర్థః. యద్వా ధనదోనవనః ధీశత్వా త్పరిమితధనః తస్మా ద్రాజరాజసంజ్ఞకోఽపి న ప్రస్థాతవ్య ఇతి. తస్మిన్ సదయసఖ్య మిత్యర్థః దుహ్యతే ప్రపూర్యతే గుణైరితి దుగ్ధం. భో శ్చంద్రస్య శ్రియేవ శ్రియా రుచ్యం మనోజ్ఞ మాహ్లాదక మిత్యర్థః. "భు శ్శంభౌ దాతరీందా వేతి రత్నమాలాయాం.

శ్రితేషు నతేషు చ సదయం తం (శ్రీ) వేంకటమహీపతి సూర్యరాయ మహారాజం రక్ష పాలయ.

ప్రకారాంతరేణ నాగబంధ ముదాహరతి నతేతి. లక్షణం తు ఫణే ద్వేవిలిఖే దూర్ధ్వ మధః పుచ్ఛద్వయం లిఖేత్ ఫణాతో విలిఖే త్తద్వ త్పుచ్ఛా ద్భోగే సమాపనం. పూర్వవైపరీత్యేన ద్వేఫణే ద్వే పుచ్ఛే చ ప్రకల్ప్య శేషం ప్రాగ్విలిఖ్య ఫణాయా ఆరభ్య పుచ్ఛేర్ధ శ్లోకసమాప్తిః. ద్వితీయపుచ్ఛా దారభ్య తత్ఫణాయా మవశిష్టార్ధ శ్లోక సమాప్తి శ్చ భవతి. నతజనపోషకం సుగుణగ్రాణం అదభ్రియశో విశాలం అవనతముదాహితం తపరతారకం ఉత్త్విషం ఆయతోదయం కదనవిధుంపరం సరసఖ అసమకృష్ణహేమేన శేముషీవసునయిగేయ యాదవమణే అమరలక్షపరం మహాకృపం ఇతి పదచ్ఛేదః. హే నర సఖ హే అర్జునప్రియ హే అసమనిస్తుల హే కృష్ణ! హే మేన! లక్ష్మీ పతే శేముష్యా బుద్ధ్యా వసునా ధనేన నయేన చ గేయ స్తుత్య స్తస్య సంబుద్ధిః. "వసుతోయే ధనే మణా వితి" రుద్రః. యాదవమణే! గోపాలచూడామణే! అమర అచ్యుత నతజనపోషకం నతజనావనం సుగుణగ్రాణం సుగుణఖ్యాత మిత్యర్థః. అత్ర యద్యపి వశిరణ్యో రుప సంఖ్యాన మితి. అబభావే ఘఞ్ బాధితః "అత ఏవ రణః క్వణ" ఇత్యనుశాసనాత్. తథాపి ప్రాచీనైవ ద్వాబహుళకో ఘఞ్ ద్రష్టవ్యః. అదభ్రియశసా విశాలం మహం తం అవనతమదా నిరస్తాతిశయా స్సాధవ ఇతి యావత్. ఆహితామిత్రాణి యస్య తం తకారః పరే యేషాం తే తపరాః హితాః, అహితాశ్చ తా నుభయా నపి తారయతి పాలనేన వధేన చేతి తథోక్తః. ఉత్త్విష మధికశోభం అయత ముదయం యస్య తం కదనే యుద్ధే విధు ర్విష్ణుః తం పరం సర్వోత్త రం మహతీ కృపా యస్య తం కృపాసముద్ర మిత్యర్థః. తం శ్రీ వేంకట మహీపతి సూర్యరాయమహారాజం లక్షపాలయ, రలయో రభేదః. పూర్వస్మా ద్విలక్షణోఽయం నాగబంధః.



## కంకణబంధః

ద్వాత్రింశదుత్తరశతద్వయశ్లోకగర్భిత ఏకాఙ్కస్సర్వలఘుః
కంకణబంధోఽయం విజయతేతరామ్.

### అనులోమగత్యా.

౨౮ శ్లోకాః.

కంకణబంధ ముదాహరతి ధనధనేతి. లక్షణం తు రేఖాభ్యాం మండలీకృత్య విలిఖే దానుగుణ్యాతః అంతరా ఊర్ధ్వరేఖాభిః ప్రత్యరం చానులోమతః. క్రమేణ ప్రతిలోమ్యేన భవంతి ద్విగుణా స్తతః పూర్వాపూర్వాగ్రహా త్తద్వ దుత్తరోత్తరసంగ్రహాత్ తావంతో వైభవంత్యేతే విముక్తేషు సమాపనం భవేత్కంకణసంజ్ఞోయం బంధరాజ ఉదాహృతః.

ధనధనద జయవర నరవర నతజనవరద రణదుద జనహరణ తపనజనవర జయసరస సకలజనభర పరమ సరభసవదన ఇతి పదచ్ఛేదః. ధనే ధనదః కుబేరః, భాగ్యవిషయే కుబేరసదృశ ఇత్యర్థః. "జయేనరార్జునః నరోఽశ్వే మానవే ర్జున" ఇతి విశ్వః. నరేషు వరః నతజనేభ్యో వరానిష్టాన్ దదాతీతి తథోక్తః. రణే మదజనాన్ హరతీతి తథోక్తః. తపనజనవరః సూర్యరాయసార్వభౌమః సరసో రసజ్ఞః సకలజనాన్ పండితజనాన్ బిభర్తీతి తథోక్తః. పరమా బుద్ధి ర్యస్య సః. కుశాగ్రబుద్ధి రిత్యర్థః. "మ శ్శివే మా రమా మేధాజననీషు ప్రకీర్త్యత" ఇతి విశ్వప్రకాశః. సరభసవదనః సస్మితముఖః తేషాం సంబుద్ధిః, జయ.

## ద్వితీయశ్లోకః

ద్వితీయశ్లోక ముదాహరతి. నధనద జయనర నరవర నతజన వరద రణమదజన హరణతపనజనవర జయసరస సకలజనభగ పరమ సరభసవదనధ ఇతి పదచ్ఛేదః. ధనదో ధనదాతా యస్మాన్న విద్యతే స నధనదః. యద్వా ధనం యేషాం న విద్యతే తేన ధనాః నిస్వాః. తేభ్యో దదాతీతి తథోక్తః. హరేపి ణతః నమ్రః హరిహరయో రభేద బుద్ధ్యా న కేవలం హరిభక్త ఏవ. కింతు హరభక్తోపీ త్యర్థః. నణయో రభేదః. రణే యుద్ధే మద ఉత్సాహో యేషాం తాదృశా జనా భటా యస్య సః. పన్యస్య ధనస్య జనవేరో రాజాపనజనవరః మహాభాగ్యా వా నిత్యర్థః. నణయో రభేదః. పణో ద్యూతాదిషూత్సృష్టే భృతౌ మూల్యే ధనేఽపి చే త్యమరః. సరభసవదనం యథాతథా దధాతి పాలయతీతి తథోక్తః డుదాఞ్ ధారణపోషణయో రితి ధాతుః. తేషాం సంబుద్ధయః శిష్టం స్పష్టం.

## తృతీయశ్లోకః

తృతీయశ్లోక ముదాహరతి ధనదేతి, ధనద జయనర నరవరనత జనవరద రణమదజనహర ణతపనజనవర జయసరససకల జనభరపర మసరభసవదనధన ఇతి పదచ్ఛేదః. ధనం దదాతీతి తథోక్తః రణే మదజనాన్ హరతీతి తథోక్తః. నతేషు పః ప్రసన్నః "ప స్త్రీప్యాత్తే ప్రసన్నే" చేతి రత్నమాలాయాం. నణయో రభేతః. జనేషు వరో యస్మాన్న విద్యతే స న జనవరః, సరభసం వదంతీతి సరభసవదనాః తాన్ ధినోతి ప్రీణయతీతి తథోక్తః. తేషాం సంబుద్ధయః శేషః ప్రాగ్వత్.

## చతుర్థశ్లోకః

నదజయ నరనర వరనత జనవరదగణ మదజనహారణ తపనజననగ జయసరస సకలజనభరపరమ సరభసవదన ధనధ. ఇతి పదచ్ఛేదః.

నాన్ క్లిష్టకర్మణః ఘాతుకాదీ నితి యాంవత్ ద్యతీతి తథోక్తః. దో అవఖండనే రణమదజనహారణే తపన స్సూర్యః ప్రతాపా త్తపనో యథేతిస్మరణా త్తపనవ త్తపతీతి భావః. సరభసం యథా తథా వతీతితథోక్తః. ధనం దదాతీతి రక్షతీతి తథోక్తః. తేషాం సంబుద్ధిః శేషః ప్రాగ్వత్.

## పంచమశ్లోకః

దజయనర నరవర నతజననరద రణమదజనహారణ తపనజనవ రజయసరస సరసకలజనభర పరమ సరభస వదన ధనధన ఇతి పదచ్ఛేదః. దదాతీతి దః దాతా దః పుంసి దాతరిచ్ఛేద ఇతి రత్నమాలాయాం. రణమదజనాన్ హంతీతి తథోక్తః. రణే తపనజో యమః నవాంతీతి నవా శ్శైలా స్తాన్ రాతి రలయో రభేదే న చ్ఛినత్తీతి నవర ఇంద్రః. తస్య జయ ఇవ జయో యస్య నః ధనేన ధినోతి ప్రీణయతీతి ధనధనః. తేషాం సంబుద్ధిః శేషః ప్రాగ్వత్.

## షష్ఠశ్లోకః

జయనరనరవర నతజనవరద రణమదజనహారణ తపనజనవర జయసరస సకలజనభరపరమ సరభసవదన ధనధనధనద ఇతి పదచ్ఛేదః. రణే తపనజనో యమః ధనేన ధనదః కుబేరః తయో స్సంబుద్ధిః శేషః ప్రాగ్వత్.

## సప్తమశ్లోకః

యనగనరవర నతజనవరద రణమదజనహారణ తపనజనవరజయ సరసనకలజనభర పరమసరభసవదన ధనధనదజ ఇతి పదచ్ఛేదః. నరాణా మహాంవరో రాజా సముద్రః యేన త్యాగేన నరవరః. త్యాగ విషయే మహోదాతా సముద్రేణ సదృశ ఇత్యర్థః. య స్త్యాగే నిలయే వాయా "నరో నారోంబువాచక" ఇతి రత్నమాలాయాం. కవికంఠ భూషణే చ నవ స్సుందరః "నవోఽభినవముగ్ధయోః" రితి ప్రతాపః. రాత్ ముఖాత్ జాతా రజాద్విజాః బ్రహ్మణో ముఖతో విప్రా ఇతి స్మరణాత్ "రం క్లీబే రుధిరే మూర్ధ్ని ధ్యానవ్యోమాండకుక్షిషు వక్త్రే భయే" చేతి రత్నమాలాయాం. తేభ్యో యచ్ఛంతీతి తధోక్తాః. ద్విజపోషకాః తేషు సరసః కలాభి ర్విద్యాభి స్సహిత స్సకలః. "అంశ మాత్రే మూలవృద్ధా సుషమావిద్యయో స్తథా తత్తదాగమసిద్ధాసు గురుణి స్త్రీరజస్యపి కలం శుక్రే వాచ్యలింగ మవ్యక్తమధురధ్వనా" వితి శేష.జనశబ్దేన తదాశ్రియ భూతో లోకో లక్షణయా గృహ్యతే. తం బిభ్రతీతి జనభరా లోకపాలాః తేషు పరమ స్సర్వశ్రేష్ఠః. ధనేన పుణ్యేన ధనేన వా ధనదజో నలకూబరః "ధనం పుణ్యే ధనేఽపి" చేతి రత్నకోశే. తేషాం సంబుద్ధిః. శిష్టం స్పష్టమ్.

## అష్టమశ్లోకః

నగనగవర నతజనవరద రణమదజనహారణ తపనజనవరజయ సరసనకలజనభర పగమసరభసవదన ధనధనదజయ ఇతి పదచ్ఛేదః. నర స్యార్జునస్య నరవరా అశ్వశ్రేష్ఠా ఇవ నరరా యస్య సః "నరో

శ్వే మానవే ర్జున” ఇతి విశ్వః. యద్వా నరశబ్దేన “ఆత్మా వై పుత్రి నామా” సీతిశ్రుతే రిందో్రి లక్ష్యతే. తస్య నగవర ఉచ్చైశ్శ్రవా ఇవ నరవరా యస్య సః. యద్వా నగస్య గలయోరభేదేన నలస్య శేషః. ప్రాగ్వత్ “హసంత మంతిగ్బలమగ్వతాం రవే” రితి నలాశ్వానా మత్యోర్ధత్వాభిధానా దితి భావః. తయో స్సంబుద్ధిః. సంగమ మితరత్.

## నవమశ్లోకః

రనరవర నతజనవరద రణమదజనహరణ తపనజనవరజయ సరససకలజనభరపరమ సరభసవదన ధనధనదజయన ఇతి పదచ్ఛేదః. రేణ త్యాగేన నరో నలః. స ఇవ వరః రలయోరభేదః. “నీరసే త్యాగ తీక్ష్ణయో” రితి రేఫార్థనిర్వచనప్రస్తావే రత్నమాలా. త్యాగవిషయే నలస్య మహత్తరత్వం అయం దరిదో్రి భవితేతి వైధసేం లిపిం లలా పేర్థిజనస్య జాగ్రతీ మిత్యాదినా నైషధే. నవాని రజాని హీరాది రత్నాభరణాని యస్య సః “రః పుమాన్ పావకే కా మే క్షయే వజ్రే నయే ఋతౌ జంకలౌ భూషణే పత్న్యా” మితి చ రత్నమాలాయాం. యేషు దాతృషు నరః “య స్త్యాగే నిలయే వాయౌ యమే దాత” రీతి రత్నమాలాయాం. రనరవర ఇతి ఉక్తార్థస్య పునరాదానేపి నరసత్వ విశేషాభానా న్న పౌనరుక్త్య మితి జ్ఞేయం. జయనంబుజయః అస్యా తథోక్తః తేషాం సంబుద్ధిః.

## దశమశ్లోకః

నరవరనత జనవరద రణమదజనహరణ తపనజనవగజయ సరససకల
జనభరపరమ సరభసవదన ధనధనదజయనర.

నరవరనతజనవరద రణమదజనహరణ తపనజనవరజయ సరస సకలజనభర పరమసరభసవదన ధనధనద జయనర ఇతి పదచ్ఛేదః.